శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – 12

(శ్రీమదణ్ణంగరాచార్యస్వామి వ్యాసమాలిక ఆధారంగా)



# పార్థసారథి పెరుమాళ్, తిరువల్లిక్కేణి




'పండితరత్న'
డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగియ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

**"కిరీట–మకుట–చూడావతంస" దివ్యసూక్తివిశేషార్థం ........................................ 5**

**వ్యాసవాల్మీకి సంభాషణం ........................................................................ 10**

**శ్రీరామాయణసారమ్ ............................................................................... 15**

**ఇద్దరు దివ్యదేవేరులకు పాఠశాలలో పరీక్ష ..................................................... 19**

**గీతాభాష్యంలో ఒక అర్థవిశేషం..................................................................... 25**

**శ్రీమహావిష్ణునక్షత్రమ్ ............................................................................. 30**

**భట్టర్ సహస్రనామ భాష్యవైభవమ్ ................................................................ 33**

**తిరుప్పాణాళ్వార్...................................................................................... 47**

**విద్యాదానమహిమ .................................................................................. 51**

**భక్తితత్త్వమ్............................................................................................ 57**

**కూరేశుల తనియన్ శ్లోకంలోని గొప్పతనం .................................................... 63**

# “కిరీట–మకుట–చూడావతంస” దివ్యసూక్తివిశేషార్థం

భగవద్రామానుజులు అనుగ్రహించిన దివ్యగ్రంథాలలో గద్యత్రయం అనేది ఒకటి. ఇందులో శరణాగతిగద్యం, శ్రీరంగగద్యం, వైకుంఠగద్యం అనే పేర్లు కలిగిన మూడిటికి గద్యత్రయం అనే వ్యవహారం. అయితే, గద్యత్రయం అనేది శ్రీరామానుజులు తామే పెట్టిన పేరు కాదు, మూడు గద్యలకు వేరు వేరుగా పేర్లను పెట్టి, మూడు వేరు వేరు దివ్యగ్రంథాలుగానే వారు అనుగ్రహించగా, అనంతరకాలంలోని ఆచార్యులు ఈ మూడు గద్యలను కూర్చి, ఒక పేరుతో గద్యత్రయం అనే వ్యవహారాన్ని చేస్తున్నట్లు తెలుస్తున్నది. వీనికి క్రమంగా పృథుగద్యం, మితగద్యం, శ్రీవైకుంఠగద్యం అనే నామాలు కూడా ఉన్నాయి.

వీటిలో, మొదటిది అయిన శరణాగతిగద్యలో “అఖిలహేయ ప్రత్యనీక” ఇత్యాది పెద్ద చూర్ణికలో భగవంతుని దివ్యరూపవర్ణనం, దివ్యగుణవర్ణనం, దివ్యభూషణవర్ణనం, దివ్యాయుధవర్ణనం, దివ్యమహిషీవర్ణనం మొదలైన పలు వర్ణలను ఆశ్చర్యకరంగా శ్రీరామానుజులు చేశారు. వాటిలో, దివ్య భూషణవర్ణనపరమైన “స్వోచిత వివిధవిచిత్రానంత” ఇత్యాది వాక్యంలో “కిరీట మకుట చూడావతంస” అనే శ్రీసూక్తిలో ఉండే గంభీరమైన అర్థాన్ని గూర్చి కొంచెం వివరింపబడుతున్నది.

కిరీటమని, మకుటమని, చూడావతంసమని ప్రత్యేకంగా మూడు పదాలు ఉన్నప్పటికీ, ఈ మూడూ కూడా శిరస్సును అలంకరించే ఆభరణాన్నే చెబుతాయి. అయితే, ఈ ఆభరణాలు ఒకే విధంగా ఉండవు. తిరు అభిషేకం

అని, కొండై అని, తోప్పారమ్ అని మూడు విధాలుగా వ్యవహరింపబడడంవల్ల, ఈ మూడు విధాలైన ఆభరణాలకు వాచకంగా కిరీటం అని, మకుటం అని, చూడావతసం అని మూడు పదాలు ఇక్కడ ప్రయోగింపబడ్డాయి– అని చెప్పవచ్చు.

ముఖ్యంగా, ఉపదేశపరంపరాప్రాప్తమై. తప్పక తెలియవలసిన రస్యరహస్యార్థం ఇక్కడ ఒకటి ఉన్నది. "తమిழ் మఱైగళ్ ఆయురముమ్ ఈన్ఱ ముదల్ తాయ్ శడకోపన్, మెయ్ మ్మాల్ వళర్ త్త ఇదత్తాయ్ ఇరామానుశన్" (ద్రావిడవేదరూపాలైన వేయి తిరువాయ్ మొழி పాశురాలను కన్నతల్లి నమ్మాళ్వార్లు, దానిని చక్కగా పెంచి పెద్ద చేసిన హితపరురాలయిన తల్లి శ్రీరామానుజులు) అనే విధంగా భగవద్రామానుజులు తిరువాయ్ మొழி ప్రబంధాన్ని వర్ధిల్లచేసినవారై ఉన్నందున, ఎల్లప్పుడూ వారు దానిని గంభీరంగా మనసులో అనుభవించేవారై ఉన్నందున, నమ్మాళ్వారుల దివ్యసూక్తిని ఒకదానిని మనసులో పెట్టుకునే "కిరీట మకుట చూడావతంస" అని మూడు శిరోభూషణాలను పలికారు.

అయితే, మరి ఆ దివ్యసూక్తి ఏది? అంటే, తిరువిరుత్తప్రబంధంలోని " పారళంద పేరరశే! ఎమ్ విశుంబరశే" ఎమ్మై నీత్తు వంజిత్త పేరరశే! " అనే పాశురమే. ఈ సూక్తిలో "అరశే! అరశే! అరశే! " అని మూడు సంబోధనలను చేయడం జరిగింది. "పారళంద పేరరశే! " అని అన్నందున లోకాలను కొలిచే నెపంతో అందరి తలలమీద శ్రీపాదాన్ని పెట్టడం అనే సౌలభ్యగుణం అనుభవింపబడింది. "ఎమ్ విశుంబరశే! " అని అన్నందున

నిత్యసూరినాదత్వం అని పరత్వం అనుభవింపబడింది. “ఎమ్మై నీత్తు వంజిత్త పేరరశే! ! ” అని అన్నందున తమతో సంశ్లేషవిశ్లేషాలను చేయడం అనే ప్రణయిత్వగుణం అనుభవింపబడింది. ఈ విధంగా సౌలభ్యగుణంకోసం ఉన్నతంగా ఉండే కిరీటం ఒకటి, పరత్వగుణంకోసం ఉన్నతంగా ఉండే కిరీటం ఇంకొకటి, ప్రణయిత్వ గుణం కోసం ఉన్నతంగా ఉండే కిరీటం మరొకొకటి— అని ఈ విధంగా మూడు కిరీటాలు నమ్మాళ్వార్లచేత భగవంతునకు అలంకరింపబడ్డాయి. ఆచార్య హృదయంలో ఈ విషయం “పారళంద వెన్టుమ్ మూన్టు ముడిక్కురియ ఇళవరశుక్కు” అనే సూక్తి ద్వారా చెప్పబడింది.

ఈ విధంగా భగవంతునకు మూడు సామ్రాజ్యాభిషేకాలు ఆళ్వారుల మనసులో ఏర్పడడాన్ని మనసులో పెట్టుకొని భగవద్రామానుజులు “కిరీట, మకుట, చూడావతంస” అనే మూడు కిరీటాలను నిర్దేశించారు— అని చెప్పాలి.

ఇక, ఈ సందర్భంగా ఒక చిన్న ప్రశ్న కలుగుతుంది. ప్రణయిత్వగుణం అనేది సౌలభ్యగుణం కంటే వేరైనదా? కాదా? దానిని వేరుగా చెప్పి, అందుకోసంగా ఒక కిరీటాన్ని అలంకరించినట్లుగా చెప్పాలా? అనేది ఆ ప్రశ్న. దానికి సమాధానాన్ని వినండి. అంతరంగభక్తుల విషయంలో అసాధారణంగా చూపించే ప్రణయిత్వగుణాన్ని సర్వసాధారణమైన సౌలభ్యగుణంలో అంతర్భవించినట్లుగా గ్రహించడం తగినది కాదు. శ్రీభాష్యంలోని “అఖిలభువనజన్మ” అని మొదలైన మంగళ శ్లోకంలో మొదటి పాదంలో స్థేమశబ్దంతో రక్షణను చెప్పినప్పటికీ, మళ్లీ తిరిగి రెండవ పాదంలో “వినతవివిధభూతవ్రాతరక్షా” అని చెప్పబడింది. ఈ విధంగా మళ్ళీ దీనిని ప్రత్యేకంగా చెప్పాలా? మొదటి పాదంలో ప్రయోగించిన స్థేమశబ్దంచేత చెప్పబడిన రక్షణలోనే ఇది కూడా చేరదా? అని అంటే, మొదట

స్థేమ అనడంవల్ల సామాన్యరక్షణ చెప్పినట్లయినది. రెండవ సారి విశేషరక్షణం చెప్పబడుతున్నది– అనే సమాధానం చెప్పవలసి ఉన్నది. బుభుక్షువుల రక్షణ వేరు, ముముక్షువుల రక్షణ వేరు కదా. ఆ విధంగానే, "ఉండియే ఉడైయే ఉకందు" అన్నట్లుగా మంచి భోజనం తిని, మంచి వస్త్రాలను కట్టుకొని, తావన్మాత్రంతో ఆనందించే ఈ లోకంలోనివారి విషయంలో చూపించే సౌలభ్యం, "ఉణ్ణుమ్ శోఱు పరుగు నీర్ తిణ్ణుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్" (భుజించే అన్నం, తాగే నీరు, ఆనందించే భోగ్యవస్తువులు అన్నీ శ్రీకృష్ణుడే) అనే విధంగా ఉండే ఆళ్వారులవంటి పరమైకాంతుల విషయంలో చూపించే సౌలభ్యం—అనే ఈ రెండూ ఒకటి కావు కదా. వీటి మధ్య చాలా వ్యత్యాసం ఉండడంచేత, ఒకటి కాబోవు. దానికి సౌలభ్యం అని పేరు, దీనికి ప్రణయిత్వగుణం అని పేరు. ఇందుచేత మూడుకళ్యాణగుణాలకు జరిగే మూడు సామ్రాజ్యపట్టాభిషేకాలకోసం మూడు కిరీటాలను స్వామికి అలంకరించడం చాలా ఉచితమైనది కదా.

## వ్యాసవాల్మీకి సంభాషణం

వ్యాసులు —వాల్మీకి మహర్షి! నమస్కారం. వ్యాసుడనని నన్ను అంటారు. తమరిచే శ్రీరామాయణం అనే ఒక ఇతిహాసం రచింపబడింది. నేనైతే, “అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః” అనే విధంగా 18 పురాణాలను రచించాను. అయినా, భూమండలంలో మీరు రచించిన శ్రీరామాయణానికి అంతటా సాటి లేని గొప్పతనం వెలుగుతున్నది. ఏ విద్వాంసుడు అయినా, నా పురాణాలలో ఏదైనా ఒకదానిని ప్రవచనం చేయడం ఆరంభిస్తే, దానిని శ్రవణం చేయడానికి కొందరే చేరుతున్నారు. మీరు రచించిన ఇతిహాసరత్నాన్ని ప్రవచనం చేయడం ఆరంభిస్తే, ప్రవచనం చేసేవారు మితబుద్ధిగా ఉన్నప్పటికీ, దానిని వినడానికి గుంపులు గుంపులుగా కూడి ఉంటున్నారు. మీ శ్రీరామాయణానికి అటువంటి గొప్పతనం ఎందువల్ల కలిగింది?అనే విషయాన్ని మీ మాటలలోనే వినాలని నేను కోరుతున్నాను.

వాల్మీకి— మహర్షుల సమూహంలో పరాశరమహర్షి చాలా గొప్పవారుగా ప్రసిద్ధులు. వారు మీ తండ్రిగారు. వారు తమ పురాణరత్నంలో “కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్, కోహ్యన్యో భువి మైత్రేయ! మహాభారతకృద్భవేత్, తేన వ్యస్తా యథా వేదా మత్పుత్రేణ మహాత్మనా” అని మిమ్ములను చాలా గొప్పగా చెప్పారు అందుచేత మీ ప్రభావాన్ని చూచి కదా లోకం అంతా ఆశ్చర్యపడుతున్నది. నా విషయంలో అయితే, నా గ్రంథానికి ఏమి అతిశయం ఉన్నది? ఉన్నట్లుగా మీరు మనసులో భావిస్తే, అది “పుణ్యైః యశో లభ్యతే” అనే లెక్కలోకి చేరుతుంది, అంతే.

వ్యాసులు– మీరు ఈ విధంగా చెప్పవద్దు. మీ శ్రీరామాయణానికి నిజానికి చాలా గొప్ప ప్రఖ్యాతి ఉన్నది. దానిని ప్రతి దినం నియమ పూర్వకంగా పారాయణంలో పెట్టుకొని, అంతటా పలువురు పలు విధాలైన హితాలను పొందుతున్నారు. పలువురు మహాకవులుకూడా మీ రామాయణాన్ని అనుసరించే కావ్యాలు, నాటకాలు చంపూగ్రంథాలు మొదలైనవానిని రచించి, కీర్తిని పొందుతున్నారు. ఉత్తరభారతంలో తులసీదాస్ అనే పరమభక్తుడు, ఆంధ్రకవి శ్రేష్ఠుడైన త్యాగరాజు రామాయణాన్ని కీర్తనలుగా రచించే భక్తగోష్ఠిలో, సంగీత గోష్ఠిలోనూ కీర్తిని పొంది వెలుగుతున్నారు. ద్రావిడదేశంలో కంబుడు అనే కవికులతిలకుడు కూడా కంబరామాయణం అనే గొప్ప కావ్యాన్ని రచించి, లోకం అంతా వ్యాపించిన కీర్తిని పొందాడు. ఈ విధంగా ఇంకా పలువురిని చెప్పాలా ఏమి? సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ భూలోకంలోని అంగవంగ కళింగ కాంభోజ కాశ్మీర కామరూప మగధ మాగధ కేరళ నేపాల ఓఢ్ర మలయాళ కర్ణాటక ఆంధ్ర ద్రావిడాది సకల దేశాలలోనూ శ్రీరామాయణంలోని ప్రఖ్యాతి కదా ప్రబలంగా కనబడుతున్నది. పలు మాటలు ఎందుకు? "వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా" అనే సుప్రసిద్ధమైన శ్లోకం తమ శ్రీరామాయణాన్ని వేదప్రాదుర్భావంగానే తెలుపుతున్నది కదా.

వాల్మీకి – తమ గొప్పతనాన్ని వేదం కీర్తిస్తున్నది కదా. "స హోవాచ వ్యాసః పారాశర్యః" అని తైత్తిరీయారణ్యకంలో అధ్యయనం చేయబడుతున్నది. అంతేకాక, "భారతః పంచమో వేదః" అని, "వేదాన్ అధ్యాపయామాస మహాభారతపంచమాన్" అని వేదంగానే చెప్పబడినది కదా, మీరు రచించిన

మహాభారతం. వ్యర్థంగా నన్ను ఎందుకోసం పొగడుతున్నారు? నిజానికి దాసుని దగ్గర ఏ విధమైన గొప్పతనం లేదు కదా.

వ్యాసులు– సదాచార్యగోష్ఠిలో పరిగ్రహాతిశయంవల్ల కలిగిన గొప్పతనం తమ గ్రంథానికి తప్ప వేరు ఏ గ్రంథానికి లేదు. మంత్రాలలోని అర్థంవలె, తమ శ్రీరామాయణంలోని అర్థాలను సదాచార్యసన్నిధానంలో నియమపూర్వకంగా గ్రహించడం అనే మర్యాద ఒకటి అనాదిగా ఉన్నదని వింటున్నాను. సర్వజ్ఞులైన భగవద్రామానుజులుకూడా తమ ఆచార్యసన్నిధానంలో ఒక సంవత్సరకాలం నివసించి, తమ శ్రీరామాయణంలోని దివ్యార్థాలను శ్రవణం చేశారు అంటే, ఇంతకంటే గొప్పతనం ఇంకొకటి ఉన్నదా! పలు పలు వ్యాఖ్యానాలు అవతరించడంకూడా మీ శ్రీరామాయణంలోని గొప్పతనాన్ని ప్రకాశింపజేస్తున్నది కదా. అంతేకాక, ఉపన్యాసగోష్ఠిలో తమ శ్రీరామాయణంలోని కొన్ని శ్లోకాలను ప్రస్తావించి, రసికులు ఆశ్చర్యకరంగా ఉపన్యసించి, సభ్యులను ఆనందపరవశులను చేస్తున్నారు అంటే, ఇంతకంటే వేరు ఏమి చెప్పాలి? ఉన్నది ఉన్నట్లుగా చెబితే, దానిని “లేదు” అని అనడం ఎందుకోసం?

వాల్మీకి– ఆ విధంగానే కానివ్వండి. మీ కుమారులు సుందరులు, మేధావి, చతురులు అని ఎవరైనా అంటే, కన్నవారికి ఆనందమే కదా. ఆ విధంగానే, దాసుడుకూడా ఆనందాన్ని పొందుతున్నాడు. నిజానికి దాసుని ప్రబంధానికి గొప్పతనం నా కృతి అనే కారణం చేతకాదు. కథానాయకుడు రామచంద్రుడుగా ఏర్పడినందునవల్లనే అని భావించాలి. నిందించాలని వచ్చినవారుకూడా కీర్తించే విధంగా కదా శ్రీరామచంద్రుని ప్రభావం ఉన్నది. ముక్కు, చెవులు కోయబడిన శూర్పణఖ ఖరదూషణాదుల దగ్గరకు వచ్చి,

శ్రీరామలక్ష్మణులను నిందించాలనే భావించింది. కానీ. ఆమె అప్పుడు "తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ, పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినంబరౌ" అని కీర్తించి పలికింది తప్ప, "పరమ పాపిష్ఠివారు, నన్ను ఈ విధంగా బాధ పెట్టారే! "అని చెప్పలేదే! తారకూడా తన భర్త అయిన వాలిని వధించిన శ్రీరాముని "త్వమప్రమేయస్య జితేంద్రియస్య" ఇత్యాదిగా స్తుతించింది. మండోదరి కూడా తనకు వైధవ్యాన్ని కలిగించిన శ్రీరాముని చూసి "తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః, శ్రీవత్సవక్షాః నిత్యశ్రీ రజయ్యః శాశ్వతో ధ్రువః" అని కీర్తించింది. రావణాసురుడు కూడా "శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః" అని పొగడాడు. అందుచేత, ఈ విధంగా నిందించాలని కోరినవారు కూడా సుతించే విధంగా ఉండే వైభవాన్ని కలిగిన శ్రీరాముని కథానాయకునిగా కలిగి ఉండడమే నా కావ్యానికి ఉండే గొప్పతనం.

ఈ విధంగా వాల్మీకి అనగా, వ్యాసుడు కూడా "అవును! తగును! తగును! " అని పలుకుతూ, తలను పంకిస్తూ, "మళ్ళీ ఇంకొక నాడు కలుస్తాను" అని అంటూ వెళ్లిపోయాడు.

# శ్రీరామాయణసారమ్

శ్రీరామాయణాన్ని అనేక పర్యాయాలు సేవించి, అనేకమార్లు ప్రవచనం చేసినవారిని చూచి శ్రీరామావతారం ఎందుకోసం? అని ఒక ప్రశ్నను అడగితే, అడిగిన వెంటనే వారు ఏమి చెబుతారు? అని అంటే, "ఇదేమి అపూర్వమైన ప్రశ్న? అయోధ్యాకాండ ఆరంభంలోనే వాల్మీకిమహర్షి స్వయంగానే స్పష్టంగా దీనికి బదులు చెప్పారుకదా. "స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, ఆర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుః సనాతనః" అని విజృంభించిన రావణుడివల్ల బాధపడిన దేవతలు అతనిని వధించమని ప్రార్థించినందున సనాతనుడైన విష్ణువు శ్రీరాముని రూపంలో మానవలోకంలో అవతరించాడు —అని అన్నారు కదా. "రావణుని సంహారంకోసం శ్రీరామావతారం సంభవించింది— అనేది ప్రసిద్ధమై ఉండగా, కొత్తగా ఇప్పుడు ఈ ప్రశ్న చేయడం ఏమి?" అని అంటారు. సాక్షాత్తు నారాయణుడేకదా దశరథుని కుమారుడుగా అవతరించాడు. అతడు సత్యసంకల్పుడుకదా. అతడు సంకల్పమాత్రంతోనేకదా అఖిలభువనజన్మస్థేమ భంగాదిలీలలను నిర్వహిస్తున్నాడు. అటువంటివాడు రావణుడనే ఒక పురుగును నలిపివేయడంకోసం ఈ భూలోకంలో పుట్టి, పడరాని పాట్లు పడాలా? విభీషణునకు అభయాన్ని ఇచ్చిన కాలంలో "పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్, అంగుళ్యగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరిగణేశ్వర" (వానరగణాలకు ప్రభువువు అయిన సుగ్రీవా! ఈ లోకంలో ఉండే పిశాచాలను, దానవులను, యక్షులను, రాక్షసులను, నేను కావాలనుకుంటే, నా కాలిగోటి చివరితో సంహరించగలనుసుమా) అని గుండెలను తట్టి చెప్పాడుకదా, శ్రీరాముడు. ఇందులో "ఇచ్ఛన్ హన్యామ్" అనేది కదా ప్రాణస్థానీయమైన వచనం.

పిశాచ దానవయక్షరాక్షస సమూహాలనే ముళ్ళపొదలను పెరికి వేయాలి— అని నేను అనుకుంటే, "అల్పప్రయత్నంతో పెరికివేయగలను" అని అంటూ కొందరు చెప్పే మాట ప్రస్తావించి, కాదనడానికి కూడా తగినది కాదు. "సంకల్పమాత్రంతోనే తొలగించి వేస్తాను" అనేదే ఇక్కడ వివక్షితమైన అర్థం. ఇటువంటి శక్తి రాఘువునకు లేకపోతే, అతడు నారాయణుడని, విష్ణువుని చెప్పడం వీలు కాదు. ఇంతేకాక, ముఖ్యంగా ఒక విషయాన్ని చూద్దాం. కార్తవీర్యార్జునుడు అనేవాడు రావణుని చెరలో పెట్టి, భంగపరచిన గొప్ప వీరుడు. అతని వేయి బాహువులను పరశువుతో ఖండించినవాడు, పరశురాముడు. ఆ పరశు. రాముని చేతినుండి వింటిని గ్రహించి, అతని తపస్సును కూడా గ్రహించినవాడు శ్రీరాముడు ఇటువంటి శక్తిని కలిగిన మహావీరుడు రావణుని సంహరించడంకోసం పడరాని పాట్లు పడ్డాడు— అని భావించడం తగినది కాదుకదా. ఇంతేకాక, రావణుని వాలి తన తోకతో చుట్టి పట్టుకుని, సముద్రాలలో అన్నిటా ముంచి, తన వెంట తీసుకుని పోవడం, కిష్కింధలోకి వచ్చిన తరువాత ఒక పురుగును విదలించినట్లు విదరించడం చేశాడు. ఇటువంటి గొప్ప శక్తిని కలిగిన వాలి శ్రీరాముని ఒక్క బాణంతో మరణించాడు. ఇంకా పలు విషయాలును ఆలోచిస్తే, శ్రీరాముని అవతారం రావణుని వధకోసం కాదు— అని నిశ్చయించడంలో అడ్డు లేదు. రామావతారం మాత్రమే కాదు, భగవంతుని ఏ అవతారం అయినా, అసుర రాక్షసాదినిరసనం కోసం కాదు. "పొల్లా అరక్కనై కిళ్ళి క్కళైందానై " అని గోదాదేవి చెప్పినట్లు, "కంసముఖ్యనృపకీట— నిబర్హణ" అని కూరేశులు పలికినట్లుగా, పురుగులను నలిపి వేయడంకోసం భగవంతుడు ఈ లోకానికి పరిగెత్తుకొని వచ్చాడు —అని

అనడం తత్త్వవిత్తుల సూక్తి కాబోదు. అయితే మరి ఎందుకోసం? అంటే, శ్రీరామావతారంలో ఉపక్రమంలోనే దీనిలో ఉండే మర్మం వ్యక్తం చేయబడింది.

మహర్షి వాల్మీకి తన ఆశ్రమానికి వచ్చిన నారదభగవానుని "శ్రీరామకథను చెప్పండి" అని అడగలేదు. మరి, ఏమని అడిగాడు? అంటే, "కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్" అని ఆరంభించి, 16 గుణాలను ప్రస్తావించి, "వీటిని కలవానినిగూర్చి చెప్పండి" అని అన్నాడు. దీనికి సమాధానం చెప్పే నారదుడుకూడా "బహవో దుర్లభా శ్చైవ యే త్వయా కీర్తితా గుణాః, మునే వక్ష్యామ్యహం బుధ్వా తై ర్యుక్తః శ్రూయతాం నరః" అని ఆరంభించి, "ఆ కళ్యాణగుణాలను కలిగినవానినిగూర్చి చెబుతాను" అని వివరంగా పలికాడు. వీటివల్ల పరమపదంలో ప్రకాశించని కళ్యాణగుణాలను ఈ లీలావిభూతిలో ప్రకాశింపచేయడంకోసమే ఇక్కడ భగవానుడు అవతరించాడు— అనేది వ్యక్తం అవుతున్నది. అందుచేతనే శ్రీపరాశర భట్టర్ కూడా "గుణపరీవాహాత్మనామ్ జన్మనామ్" అని అన్నారు. మహాకవి అయిన భవభూతికూడా "పూరోత్పీడే తటాకస్య పరివాహః పరిక్రియా" అని అన్నాడు. ఒక పెద్ద తటాకంలో నీటి ప్రవాహం నిండితే, ఆ చెరువు తూములను తెరిస్తే తప్ప ఆ చెరువు నిలబడదు. దానికే పరివాహక్రియ అని పేరు. ఆ విధంగానే, క్షమ, దయ, వాత్సల్య, సౌశీల్యాది గుణాలు పరమపదంలో ప్రకాశించవు. కనుక, వాటిని వ్యక్తం చేస్తే తప్ప నిలువ లేని భగవంతుడు వాటి పరివాహంకోసమే ఇక్కడకు వచ్చి అవతరించాడు— అనేది మనం గమనించదగిన పరమార్థం.

# ఇద్దరు దివ్యదేవేరులకు పాఠశాలలో పరీక్ష

సీతాదేవి, గోదాదేవి ఇద్దరు ఒకానొక సమయంలో ఏకకాలంలో ఏకస్థలంలో అవతరించారు. ఇద్దరు తగిన కాలంలో విద్యను అభ్యసించడంకోసం పాఠశాలకు పంపబడ్డారు. "మీరు ఇద్దరు దేనిని అభ్యసిస్తారు?" అని ఉపాధ్యాయుడు వారిని అడిగాడు. అప్పుడు సీతదేవి "నేను శ్రీరాముని పత్నిని కనుక, శ్రీరామాయణాన్ని పాఠంగా అధ్యయనం చేయాలని కోరుతున్నాను" అని అన్నది. గోదాదేవి కూడా "శ్రీకృష్ణుడు అనే దైవాన్ని నేను ప్రేమించినదానను కనుక, శ్రీభాగవతాన్ని పాఠంగా కలిగి ఉండాలని కోరుతున్నాను" అని అన్నది. ఆ విధంగానే వారిద్దరూ తమ తమ పాఠాన్ని చదివి, ప్రావీణ్యాన్ని. గడించారు. సీతాదేవి శ్రీరామాయణంలో ప్రావీణ్యాన్ని గడిచింది. గోదాదేవి శ్రీభాగవతంలో వైదుష్యాన్ని సంపాదించింది. వీరిద్దరిని ఒకనాడు ఉపాధ్యాయుడు పరీక్ష చేయాలని అనుకున్నాడు. వీరిద్దరూ కూడా ఆ పరీక్షను పొందాలని చాలా ఆసక్తిగా ఉన్నారు. ఉపాధ్యాయుడు ఇద్దరికి రెండు సమాధాన పత్రాలను ఇచ్చాడు. సీతతో "సీతా! శ్రీరామునిలో నీవు సారంగా గ్రహించిన గుణాన్ని గూర్చి సంగ్రహంగా ఇందులో రాయి" అని సీతను నియమించాడు. ఆ విధంగానే, గోదాదేవితో "గోదా! శ్రీకృష్ణుని విషయంలో నీవు సారంగా గ్రహించిన కళ్యాణ గుణాన్ని గూర్చి ఈ పత్రంలో సంగ్రహంగా వ్రాయి" అని ఆమెను నియమించాడు. వారిద్దరూ వెంటనే వేగంగా సమాధాన పత్రాలపై సమాధానాన్ని రాసి, ఉపాధ్యాయునకు ఇచ్చారు. సీతాదేవి వ్రాసినది 8 అక్షరాలు. గోదాదేవి వ్రాసినది ఒకటే అక్షరం. "ఇంతకు ముందే నేను చేసినది, లోకంలో వ్యాపించినదే ఇది" అని ఇద్దరూ చెప్పారు. ఉపాధ్యాయుడు సీతాదేవి వ్రాసినదానిని ముందుగా

చదివాడు. "శరణాగత వత్సలః" అనేవి ఆ ఎనిమిది అక్షరాలు. గోదాదేవి వ్రాసినది చదివాడు. అందులో "మాల్" అని ఒకే అక్షరం ఉన్నది.

ఉపాధ్యాయుడు సీతను చూచి, "సీతా! ఇది ఇంతకు ముందే నేను వ్యక్తం చేసినది, లోకం అంతా ప్రసిద్ధి చెందింది అని అన్నావు కదా. ఎక్కడ వ్యక్తం చేశావు? దానిని చూపించి, దాని అర్థాన్ని నువ్వే వివరించు, వింటాను" అని అన్నాడు. సీతాదేవి ఈ విధంగా అన్నది.

సీత—నేను రావణునకు హితోపదేశం చేసేటప్పుడు "విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః" అని చెప్పినది లోకమంతా వ్యాపించింది కదా. " శరణాగత వత్సలః" అనే బిరుదు శ్రీరామునకు తప్ప, ఇంకొకరికి తగినదా? తనను శరణాగతి చేసినవారి విషయంలో గొప్ప ప్రేమను చూపిస్తాడు— అనే విషయం సామాన్యమైన అర్థం. శరణాగతుడు అనేదానికి మనోవాక్కాయ శుద్ధితో శరణాగతి చేసినవాడు— అని అర్థం కాదు. తనతో సంబంధం కలిగినటువంటివారిని అందరిని శరణాగతునిగా గ్రహించేవాడు, అతడు. అందువల్లనే నేను తరువాత చెప్పినది ఏమి?— "తేన మైత్రీ భవతు తే" —అని. "శరణాగత వత్సలః విదిత సః" అని పూర్వం చెప్పినదానికి తగినట్లు "తమేవం శరణం గచ్ఛ" అని కదా, తరువాత నేను చెప్పాలి. ఆ విధంగా చెప్పకుండా, "తేన మైత్రీ భవతు తే" అని నేను చెప్పినందున మైత్రి కూడా శరణాగతికి పర్యాయం అని తప్పక తెలియజేస్తుంది. కాళ్ళను పట్టుకోవద్దు చేతులను పట్టుకుంటే చాలు. చేతులను పట్టుకుంటే వదిలించుకొని పోతాడు— అని, "అనతిక్రమణీయం హి చరణగ్రహణం" కనుక, కాళ్ళను పట్టుకుంటేనే కార్యం

సిద్ధిస్తుంది– అని చెప్పడం మిగిలినవారి విషయంలోనే. మూలపురుషుడైన నారాయణుని విషయంలోనే. నా స్వామి విషయంలో ఆ విధంగా కాదు. అందరూ తనకు స్నేహితులుగా ఉండాలి– అనేదే వారి ఆశ. చాలా తక్కువవాడైన గుహునితో స్నేహం చేసిన విషయం లోకప్రసిద్ధం కదా. "రామస్య ఆత్మసమః సఖా" అని వాల్మీకిమహర్షి అన్నాడు కదా.

ఉపాధ్యాయుడు– "శరణాగతవత్సలః" అనే 8 అక్షరాలలో శ్రీరామాయణసారాన్ని నీవు అంతర్భవింపచేసి చెప్పినది చాలా సంతోషమైనది. ఇక, గోదాదేవిని అడుగుతాను– అని, గోదాదేవి వైపు తిరిగి,

గోదా! నీవు శ్రీకృష్ణుని గుణాన్ని సారంగా "మాల్" అనే ఒక అక్షరంతో చెప్పాను– అని అన్నావు. దానిని ఎక్కడ తెలియజేశావు? దాని అర్థాన్ని నువ్వు వివరించి చూపించు, చూద్దాం అన్నాడు.

గోదాదేవి– తిరుప్పావైలో "మాలే" అని అన్నాను కదా. దానికి తరువాత ప్రబంధంలో "మాలాయ్ పిఱంద నంబియై మాలే శెయ్యుమ్ మణాళనై" అని అన్నాను. నా భర్త అయిన శ్రీకృష్ణుని వైభవ సర్వస్వం "మాల్" అనే ఒకే ఒక మాటలో అంతర్భవించి ఉన్నది అంటే, అది అతిశయోక్తి కాదు, "మాల్" అనే పదానికి ద్రావిడనిఘంటువులలో మూడు అర్థాలు ఉన్నాయి. "మాల్ ఎన కరుమై పెరుమై మైయలుమామ్" (మాల్ అనే పదానికి నలుపు, గొప్పతనం, వ్యామోహం అని అర్థం) అని నిఘంటువచనం. నల్లని వాడు, గొప్పవాడు అనే అర్థాలు ఉండనివ్వండి. మూడవది అయిన అర్థం వ్యామోహం అనేది. ముఖ్యం.

"మైయల్" అన్నా, "మయల్" అన్నా పొసాగుతుంది. పైత్యం అని లోకంలోనివారు చెబుతారే, అదే మూర్తీభవించినవాడు. మోహం పొందినవాడు, వ్యామోహం కలవాడు, పిచ్చిని కలవాడు పిచ్చివాడు– అంటే, నా శ్రీకృష్ణునకు పరమానందం. నా అత్తగారైన యశోదాదేవి "పేయ్ ప్పాల్ ముల్లై ఉండ పిత్తనే! " (పిశాచి అయిన పూతన పాలను తాగిన వ్యామోహం కలవాడా) అని పిలిస్తే, నా భర్త మనస్సు చాలా ఆనందపడుతుంది. పూదత్తాళ్వారులు కూడా "మాలే! నెడియోనే! కణ్ణనే! " అని నా భర్తను సంబోధించారు. అయితే, వారు నా వ్యామోహాన్ని తాము అనుభవించి చెప్పినవారు కారు. మాల్ అనే పదానికి వ్యాముగ్ధుడు– అనే అర్థం ఉన్నదని ఆ దివ్యసూరి తెలిసినవారు– అని నేను భావించడం లేదు.

ఉపాధ్యాయుడు– గోదా! ఆ పరమాత్మను పిచ్చివాడని అంటున్నావే! నీవు అనుభవించిన పిచ్చిని కొంచెం వివరిస్తావా? దానిని వినే భాగ్యమైనా నాకు కలుగకూడదా! దారిలో పోయేవారి మీద రాయి ఎత్తి విసరినవానిని మనం పిచ్చివాడు అని, పైత్యం పట్టినవాడని అంటున్నామే! . శ్రీకృష్ణుని విషయంలో నీవు అనుభవించిన పిచ్చి ఇటువంటిది కొంచెం చెప్పు, వింటాను.

గోదాదేవి– ఉత్తర మధురకు వచ్చి అవతరించినవాడు అవతరించిన నాడే గొల్లకులానికి మంగళ దీపంగా అయ్యాడు కదా! అందులోనే తెలియలేదా, అతని పిచ్చి ఎటువంటిదో! శ్రీకృష్ణుడు అవతరించిన కారణాన్ని పలువురు పలు విధాలుగా చెప్పారు. మిగిలినవారు చెప్పినదేమి? నేను చెప్పినది ఏమి? అనేది మీకు తెలియదే! చెబుతున్నాను, వినండి. నా పెద్దతండ్రిగారు నమ్మాళ్వార్లు

"ఇన్నివ్వాయర్ కులత్తై వీడుయ్య తోన్డియ కరుమాణిక్క చ్చుడర్" (ఈనాడు గొల్ల కులం అంతా తరించేటట్లు అవతరించిన నీలరత్నంవంటి కాంతిని కలవాడు) అని ఇంతకుముందు చెప్పి, తరువాతనే "మణ్ణిన్ పారమ్ నీంగుదఱ్కే వడ మధురై ప్పిఱందాన్" (భూభారం తొలగడంకోసమే ఉత్తర మధురలో అవతరించాడు) అని అన్నారు. నా చిన్నతండ్రిగారైన తిరుమంగై ఆళ్వారులు "కానాయన్ కడిమనైయిన్ తయిరుండు నెయ్ పరుక నందన్ పెఱ్ఱ ఆయన్" అని అంటూ గొల్లకులంలో గవ్యం వ్యర్థంగా పోకుండా, పెరుగు, వెన్న, నేయి మొదలైనవాటిని నోరారా భుజించడం కోసం వచ్చి పుట్టినవాడు– అని అన్నారు. నేను ఏమి చెప్పానో తెలుసునా? "కంజన్ వళై వైత్తవన్ను కారిరుళ్ ఎల్లిల్ పిఴైత్తు నెంజు దుక్కమ్ శెయ్య పోందాయ్, నిన్ఱ ఇక్కన్నియరోమై" అని అంటూ నా కడుపు మంట తీరేటట్టుగా చెప్పాను. వసుదేవ దేవకిదేవులను సంకెళ్ళలో బంధించి, చెరలో పెట్టి, నీవు పుట్టిన వెంటనే నిన్ను బాధించడం కోసం కంసుడు ఉండగా, అతనినుండి తప్పి బతికి బయటపడి, ఈ గొల్లకులంలోకి వచ్చి స్వామి చేరినది ఎందుకోసమో తెలియునా? మా మనసులలో దుఃఖాన్ని కలిగించడం కోసమే –––––––అని పలికి, స్వామీ! ఉపాధ్యాయా! తరువాత నాకు చెప్పడం సాధ్యం కాలేదే! "కాలు మెఴగా, కణ్ణనీరుమ్ నిల్లా, ఉడల్ శోర్ న్దు నడుంగి క్కురల్ మేలు మెఴగా మయిర్ కూచ్చు మఱా" (కాళ్ళు కదలడం లేదు, కంటి నీరు నిలవడం లేదు, శరీరం వణకి, కంఠధ్వని పెగలడం లేదు, రోమాంచం తగ్గడం లేదు) అని నా తండ్రి గారు పడిన పాట్లను పడుతున్నాను, అయ్యో! అని అంటూ, గోదాదేవి పాఠశాలను విడిచిపెట్టి, జయదేవుని గీతగోవిందాన్ని పాడుతూ వెళ్ళిపోయింది.

ధీర సమీరే యమునా తీరే వసతి వనే వనమాలీ,

గీపీపీనాపయోధరమర్ధన నిర్ణయ కరయుగశాలీ,

శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామాం,

ధీర సమీరే యమునా తీరే వసతి వనే వనమాలీ, .

# గీతాభాష్యంలో ఒక అర్థవిశేషం

శ్రీభగవద్గీతకు మన భాష్యకారులైన భగవద్రామానుజులు అనుగ్రహించిన భాష్యాన్ని లోతుగా గమనించి చూస్తే, దాని అరుదైన గొప్పతనం వాచామగోచరం— అని ఏర్పడుతుంది. సంక్షేపంగా ఆ భాష్యం ఉన్నప్పటికీ, ఆ వ్యాఖ్యానశైలిలోని అందం, దానికి మించిన గాంభీర్యం, దానికి మించిన మాధుర్యం చెప్పడానికి సాధ్యం కానివి. ఇప్పుడు ఒక శ్లోకంలోని కొన్ని పంక్తులను ప్రస్తావించి, వాటిలో ఉండే రసవిశేషాలను అనుభవించాలని, అనుభవింపజేయాలని ఈ వ్యాసాన్ని వ్రాస్తున్నాను.

భగవద్గీతలోని ఎనిమిదవ అధ్యాయంలో 14వ శ్లోకం ఈ విధంగా ఉన్నది.
"అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః. "

"జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్" అని భగవంతుడు తనకు ప్రాణస్థానంగా కీర్తించే జ్ఞాని అయినవాడు తనను ఉపాసించవలసిన రీతిని, అతడు ప్రాప్యాన్ని పొందే ప్రకారాన్ని ఇక అనుగ్రహిస్తున్నాడు— అని ఇక్కడ అవతారికను అనుగ్రహించి, ఈ శ్లోకాన్ని చాలా అందంగా శ్రీరామానుజులు వ్యాఖ్యానించారు. ఈ శ్లోకంలోని భావం ఏమిటంటే, "అర్జునా! ఎవడు నిరంతరంగా, ఎల్లప్పుడూ వేరు విషయాన్ని దేనిని భావించకుండా, నన్నే స్మరిస్తున్నాడో, నాతో నిత్యసంశ్లేషాన్ని కోరే ఆ భక్తునకు నేను సులభుడను" అనేది ఈ శ్లోక భావం. ఇందులో, "అతనికి నేను సులభుడను" అనే భాగానికి శ్రీరామానుజులు

భాష్యాన్ని అనుగ్రహించిన అందమైతే, సత్సంప్రదాయరసికులచే తప్పక అనుభవించదగినది. ముందుగా భగవద్రామానుజుల భాష్యపంక్తులను ఉదాహరించి చూపి, తరువాత వివరిస్తాను.

"తస్య –నిత్యయుక్తస్య యోగం కాంక్షమాణస్య యోగినః, అహం సులభః, అహమేవ ప్రాప్యః, న మద్భావ ఐశ్వర్యాదికః. సుప్రాపశ్చ. తద్వియోగ మసహమానః అహమేవ తం వృణే. మత్ప్రాప్త్యనుగుణోపాసనాదికం, తద్విరోధినిరసనం, అత్యర్థమత్ప్రియత్వాదికం చ అహమేవ దదామీత్యర్థః. యమేవైష వృణుతే తేన లభ్యః ఇతి శ్రూయతే, వక్ష్యతి చ తేషాం సతతయుక్తానా మితి. "

ఇంతవరకు ఉండే భాగం గీతాభాష్యసూక్తి.

దీని భావం ఏమంటే –నాతో ఎల్లప్పుడు కలసి ఉండాలి–అనే ఆశను కలిగినవానికి పొందదగినవాడను నేనే అవుతున్నాను. చాలా సులభంగా పొందదగినవాడను నేను అవుతున్నాను, అంటే, అతని విశ్లేషాన్ని సహించలేనివాడనై, అతనిని విడిచిపెట్టి ధరించలేనివాడనై, నేనే అతనిని వరిస్తున్నాను నన్ను పొందడం కోసమైన ఉపవాసనాదులు పరిపక్వదశను పొందడాన్ని, దానికి తగిన ఆటంకాలు తొలగిపోవడాన్ని, నా విషయంలో అధికమైన ప్రీతి మొదలైనవానిని నేనే అతనికి అనుగ్రహిస్తాను. నాయమాత్మాశ్రుతిలో ఈ అర్థం ప్రసిద్ధంగా ఉండడంతో పాటు, ఇక్కడ గీతలో, తరువాత పదవ అధ్యాయంలోని పదవ, పదకొండవ శ్లోకాలతోకూడా చెప్పబడుతున్నది.

ఆచార్యులారా! సత్సంప్రదాయసారార్థం ఇక్కడ బోధింపబడిన సౌందర్యం ఏమని చెప్పడం! స్వగతస్వీకారం అని, పరగతస్వీకారం అని రెండూ మాటలు ఉన్నాయి కదా. చేతనుడు తానే భగవంతుని పట్టుకోవడం అనేది స్వగతస్వీకారం అవుతుంది. భగవంతుడు తానే చేతనుని వరించడం అనేది పరగతస్వీకారం అనబడుతుంది. సత్సంప్రదాయరసాన్ని తెలియని కొందరు పరగతస్వీకారం అనే దానిలోని రసాన్ని కొంచెం కూడా తెలియకుండా, ఇది స్వయంవ్యక్త సంప్రదాయం అని దూషిస్తున్నారు. శ్రవచనభూషణంలో "జీవుడు భగవంతుని పొందాలని ఆశపడినప్పుడు ఈ ప్రపత్తి కూడా ఉపాయం కాదు. అతడు ఇతనిని పొందాలని భావించినప్పుడు, పాతకంకూడా అడ్డు కాదు" అని పలికిన చోట వ్యాఖ్యానంలో శ్రీవరవరమునులు—

"సొత్తును సొత్తుదారుడు పొందినట్లుగా, స్వామి అయిన భగవంతుడు తానే వచ్చి అంగీకరించగా, చూడదగినవాడై, పరతంత్రుడైన ఈ జీవుడు తాను ఫలియై, తన స్వీకారంతో స్వతంత్రుడై, భగవంతుని పొందాలని భావించినట్లయితే, ఆ జీవుని తలపు ఫలించక పోతే, ఈ విధంగా విలక్షణమై ఉండే ప్రపత్తికూడా భగవంతుని ప్రాప్తికి సాధనం కాదు— అని భావం. స్వామియై, స్వతంత్రుడైన భగవంతుడు తన సొత్తై, పరార్థమై ఉండే ఈ జీవుని స్వేచ్ఛతో పొందాలని అనుకున్నప్పుడు, జీవుడు చేసిన మహాపాపంకూడా ప్రతిబంధకం కాదు— అని భావం. ఈ రెండిటితో స్వగతస్వీకారానుపాయత్వం, పరగతస్వీకారోపాయత్వం చెప్పబడింది, అంటే, స్వగతస్వీకారం ఉపాయం కాదని, పరగతస్వీకారమే ఉపాయమని చెప్పబడింది"

అని ఈ విధంగా అనుగ్రహించిన శ్రీసూక్తులు పైన చూపిన గీతాభాష్యశ్రీసూక్తులనే ఆధారంగా చేసుకున్నవి— అని చక్కగా బోధపడుతున్నది. శ్రీరామానజులు తాము పూర్వం ఒక వేషంతో గీతాభాష్యంలో సంస్కృతంతో అనుగ్రహించినదానినే తరువాత, ఇంకొక రూపంతో శ్రీవచనభూషణ వ్యాఖ్యానంలో ద్రావిడభాషతో అనుగ్రహించారు— అని నిశ్చయించుకోవడంలో ఏ అడ్డు లేదు.

గీతాభాష్యశ్రీసూక్తిని ఒక్కొక్కటిగా గ్రహించి గమనిద్దాం.

(తద్వియోగ మసహమానః అహమేవ తం వృణే) జ్ఞాని అయిన చేతనుని విశ్లేషించడాన్ని సహించలేనివాడై, తానే ఆ జీవుని వరిస్తున్నట్లుగా పలికే భగవంతుని సూక్తి పరగతస్వీకారమనబడుతుంది.

(మత్ప్రాప్త్యనుగుణోపాసనాదికం, తద్విరోధినిరసనం, అత్యర్థమత్ప్రియత్వాదికం చ అహమేవ దదామీత్యర్థః) ఈ వాక్యం స్వగతస్వీకారంపై ఉండే ఆశను పూర్తిగా ఖండిస్తున్నది. జీవునిలో అతని ప్రయత్నంతో ఏర్పడేది అంతా భగవంతుని కృషిఫలంగా కలుగుతున్నదే తప్ప, ఇతనివల్ల కలిగేది, సంపాదించుకోగలిగినది ఏదీ లేదు— అనే సత్సంప్రదాయసారార్థం ఇక్కడ తెలుపబడింది. ఈ సందర్భంగా న్యాయమాత్మాశ్రుతిని ఉదాహరించిన భాష్యకారులు పరగతస్వీకారానికి అదే

ప్రమాణమని నిరూపించడంద్వారా పలువురు పలికే సాహసవాదాలను నిరసించినవారయ్యారు.

ఈ సందర్భంలో తాత్పర్యచంద్రికలో శ్రీవేదాంతదేశికులు అనుగ్రహించిన దివ్యసూక్తులు పాలు, తేనె, కలకండ, అమృతంవంటివి. “ఉక్తస్య అతివాదమాత్రత్వశంకానిరాసాయ శ్రుతిమూలతామాహ– యమేవేతి” (చెప్పిన విషయం అతివాదం అనే సందేహాన్ని తీర్చడంకోసంగా పరగతస్వీకారం శ్రుతిమూలకమైనది అనే విషయాన్ని “యమేవేతి” అని తెలియజేస్తున్నారు) అని పలకడం చాలా లోతుగా గమనించదగినది. “మహతామపి కేషాంచిదతివాదాః పృథగ్విధాః” (కొందరు పెద్దవారుకూడా చేసే అతివాదాలు అనేక విధాలుగా ఉంటాయి) అనే శ్రీసూక్తిలో దేశికులు ఈ విధంగా చెప్పడం ఎందుకంటే, వారు ప్రమాణశరణులు కనుక.

# శ్రీమహావిష్ణునక్షత్రమ్

భగవానుడు, “పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే” (సాధువులను రక్షించడం కోసం, దుర్మార్గులను శిక్షించడం కోసం, ధర్మాన్ని చక్కగా స్థాపించడం కోసం ప్రతి యుగంలోనూ నేను అవతరిస్తాను) అని గీతలో పలికినట్లుగా, “ఎన్నినృ యోనియుమాయ్ పిఱందాయ్ ఇమైయోర్ తలైవా! ” (ఓ నిత్యసూరి నాయకా! ఎన్నెన్ని జాతులలో నీవు అవతరించావో కదా) అని, “మనిశరుమ్ మ*ఱ్ఱు*మ్ ము*ఱ్ఱు*మాయ్ మాయప్పిఱవి పిఱంద” (మానవుడుగా, ఇంకా అనేక జాతులలో ఆశ్చర్యకరమైన జన్మలను ఎత్తిన) అని ఆళ్వార్లు చెప్పిన విధంగా పలు అవతారాలను ఎత్తాడు. ఆ అవతారాలకు విభవావతారాలు అని పేర. శ్రీరామకృష్ణాది అవతారాలకే విభవతారాలు అని వ్యపదేశం. ఈ విధంగా అవతరించేటప్పుడు, శ్రీరాముడు పునర్వసు నక్షత్రంలో అవతరించినట్లు, శ్రీకృష్ణుడు రోహిణి నక్షత్రంలో అవతరించినట్లు, నృసింహస్వామి స్వాతి నక్షత్రంలో అవతరించినట్లు ఇతిహాస పురాణాల వల్ల తెలుసుకుంటున్నాము. శ్రీరామకృష్ణ నరసింహ మూర్తులకు ఆ యా దివ్యదేశాలలో తిరునక్షత్రోత్సవాలు నిర్వహింపబడడం, పూర్వం సూచించిన నక్షత్రాలలో అవి నిర్వహింపబడడం కూడా గమనిస్తున్నాము. ఇందులో మతభేదం ఉన్నట్లు తెలియడం లేదు.

ఈ విధంగా ఉండగా, పెరియాళ్వార్లు నృసింహ స్వామి, శ్రీకృష్ణుడు శ్రవణా నక్షత్రంలో అవతరించినట్లు పలకడం పొసగుతుందా? అని కొందరు సందేహించడం ఉన్నది. తిరుప్పల్లాండు ప్రబంధంలో “తిరువోణ త్తిరువి*ழ*విల్

అందియంబోదిల్ అరియురువాకి" (శ్రవణానక్షత్రంలో సంధ్యాసమయంలో నృసింహమూర్తియై)అనే పాశురంలో నృసింహస్వామి శ్రవణా నక్షత్రంలో అవతరించినట్లు చెప్పబడింది. పెరియాళ్వార్ తిరుమొళి ప్రబంధంలో శ్రీకృష్ణుడు శ్రవణా నక్షత్రంలో అవతరించినట్లు అనేక పర్యాయాలు చెప్పబడింది. "నీ పిఱంద తిరువోణమ్ ఇన్రు నీ నీరాడవేండుమ్" (నీవు అవతరించిన శ్రవణా నక్షత్రం, ఈనాడు, నీవు స్నానం చేయాలి) అని మొదలైన పాశురాలను చూడవచ్చు. ఇతిహాసపురాణ ప్రక్రియకు, సర్వసంప్రతిపన్నమైన లోకవ్యవహారానికి విరుద్ధంగా ఆళ్వార్లు ఎందుకు ఈ విధంగా పలికారు? అని ఆలోచించవలసి ఉన్నది.

సంస్కృతవేదంలో "శ్రోణానక్షత్రం విష్ణుః దేవతా" అని అధ్యయనం చేయబడుతున్నది. ఇందుచేత శ్రవణా నక్షత్రం విష్ణువునకు అసాధారణ నక్షత్రమని చెప్పబడుతున్నది. భగవంతుడు ఏ నక్షత్రంలో అవతరించినప్పటికీ, అది శ్రవణా నక్షత్రం అంశంతో కూడినదిగానే ఉంటుంది —అని వైదికులు అభిప్రాయపడుతున్నారు. భగవంతుడు ఏ పుష్పాన్ని అలంకరించుకున్నా, అందులో తులసి యొక్క అంశం అవినాభూతం— అని చెప్పడం కూడా ఉన్నది. ఈ న్యాయమే ఇక్కడ, శ్రవణానక్షత్రం విషయంలో, కూడా పొసగుతుంది.

పెరియాళ్వార్లు "అత్తత్తిన్ పత్తానాల్ తోన్టియ వచ్చుదన్" (హస్తానక్షత్రంనుండి పదవ నక్షత్రంలో అవతరించిన అచ్యుతుడు) అని పలికారు. హస్తా నక్షత్రంనుండి పదవ నక్షత్రం శ్రవణా నక్షత్రం అయినట్లుగానే, రోహిణి కూడా

అవుతుంది ఏ విధంగా అంటే, హస్తానక్షత్రంనుండి ముందుకు లెక్కిస్తే, పదవ నక్షత్రం శ్రవణా నక్షత్రం అవుతుంది. క్రిందకు లెక్కిస్తే రోహిణీ నక్షత్రం అవుతుంది. అందుచేత శ్రీకృష్ణుడు రోహిణిలో అవతరించినట్లు పెరియాళ్వార్లు నిర్దేశించారు– అని కొందరు పెద్దలు నిర్వహించడం కూడా ఉన్నది. పైకి లెక్కించే క్రమాన్ని విడచిపెట్టి, కిందకు లెక్కించే క్రమాన్ని భావించి, ఆళ్వారులు ఈ విధంగా పలికారు– అనేది ఉచితం కానప్పటికీ, అదికూడా వారి మనసులో ఉండి ఉండవచ్చు. “అత్తత్తిన్ పత్తానాళ్” అని పలకడంలోని భావాన్ని మన ఆచార్యులు చాలా రస్యంగా అనుగ్రహించడాన్ని వ్యాఖ్యానాలలో గమనించవచ్చు. ఈ విధంగా విభవావతారమూర్తులు వేరు వేరు నక్షత్రాలలో అవతరించినప్పటికీ, వారు శ్రవణా నక్షత్రంలో అవతరించినట్లుగానే అనుగ్రహించడంలో అనౌచిత్యం ఏమీ లేదు –అని, వైదిక ప్రక్రియకు ఇది అనుగుణమే– అని చెప్పబడినట్లయినది.

# భట్టర్ సహస్రనామ భాష్యవైభవమ్

శ్రీవిష్ణుసహస్రనామానికి అద్వైతం, ద్వైతం, విశిష్టాద్వైతం— అనే మూడు విధాలైన సంప్రదాయాలకు సంబంధించి భాష్యాలు అవతరించాయి. వాటిలో, మన విశిష్టాద్వైత సంప్రదాయానికి తగిన రీతిలో ఉండే భాష్యాన్ని అనుగ్రహించినవారు శ్రీపరాశర భట్టర్. ఈ భాష్యానికి భగవద్గుణ దర్పణం అని పేరు. ఈ భాష్యానికి ఈ నామం చాలా యుక్త మైనది. భగవద్గుణానుభవాన్ని చేయాలనే కుతూహలం కలవారు ఈడు ముప్పత్తాఱాయిరప్పడి అనే భగవద్విషయ దివ్యగ్రంథంతో కాలక్షేపం చేయాలి— అనేది ప్రసిద్ధమైన విషయం. అందులో అవగాహన చేసే యోగ్యత లేనివారు, పూర్తిగా సంస్కృత పండితులుగా ఉండేవారు, శాస్త్రజ్ఞానం ఉండేవారు అద్భుతంగా గుణానుభవం చేయాలని కోరినట్లయితే, వారికి ఈ సహస్రనామభాష్యమే శరణం అనేది చెప్పనక్కరలేదు. ఇంతకుముందే సహస్రనామానికి శంకర భాష్యం అవతరించింది. నిర్గుణ బ్రహ్మవాదులు భగవంతుని తిరునామాలకు ఆర్థాన్ని చెప్పాలని ప్రయత్నించడం చాలా సాహసంసుమా— అని భట్టర్ అభిప్రాయం కాబోలు.

భగవద్గుణాలను అద్భుతంగా అనుభవించడం కోసమే ఏర్పడిన ఈ సహస్రనామానికి దివ్యసూరుల హార్ధవచనాలలో గాఢంగా అవగాగించినవారే కదా అర్థాన్ని నిరూపించడానికి ముందుకు రావాలి. ఆ దివ్యసూరుల సూక్తులకు పూర్తిగా దూరంగా ఉండేవారైన ఇతరమతస్థులు ఈ సహస్రనామ స్తోత్రానికి అర్థాన్ని చెప్పాలని ముందుకు రావడం, మనసుకు లోచినట్లుగా వ్యాఖ్యానం

చేయడం ఎంత ఆశ్చర్యకరం! అని చాలా బాధపడి, భట్టర్ దీనికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించాలనే ఆజ్ఞను శ్రీరామానుజులవల్ల పొందారు. గుణానుభవం కోసంగా పెట్టి పుట్టినవారిలో ప్రధానులు కదా, భట్టర్. దివ్య సూరుల సూక్తిసుధాసాగరంలో రాత్రి పగలు అవగాహహించి, అరుదైన అర్థాలను అద్భుతంగా అనుభవించి, అనుభవింపజేసే పరమరసిక సార్వభౌములైన భట్టర్ అనుగ్రహించిన భాష్యాన్ని మన సంప్రదాయంలో ఉండేవారిలో కూడా పరిపూర్తిగా సేవించేవారు చాలా తక్కువ అనే చెప్పాలి. నిజానికి ఈ భాష్యాన్ని అనుభవించగలిగిన యోగ్యత కలవారు దుర్లభులే. ఎందుకంటే, "పరిచితమ్ ఇవాథాపి గహనమ్, బహుముఖయ వాణీవిలసితమ్" అని శ్రీరంగనాయకిని ఉద్దేశించి తాము ప్రార్థించిన రీతిలో, అతిగంభీరమైన వాగ్విలాసాలతో పూర్తిగా ఈ భాష్యాన్ని వారు నిర్మించారు. అందుచేత, దీనికి తగిన అధికారులు చాలా తక్కువ మంది అనే చెప్పాలి. ఒక విధంగా అధికారం పొందినవారిలో కూడా, దీనితో కాలక్షేపం చేసేవారిని మనం చూడడం, చూడగలగడం కూడా తక్కువే. ఆవశ్యకం అయినప్పుడు చూడడం— అనే క్రమంలో దీనిని సేవించేవారు కూడా కొందరే తప్ప, శ్రీభాష్య గీతాభాష్యాదులనువలె దీనినికూడా నియతంగా సేవించ గలిగినవారు లేరు కదా! అనే నిర్వేదం మాకు చాలా ఉన్నది. అయితే, దివ్యప్రబంధాలలో అవగాహన లేకపోవడంతో పాటు, వాటిలో ద్వేషం ఉండేవారు ఈ భాష్యామృత సాగరంలో ప్రవేశించకుండా ఉండడమే చాలా క్షేమం —అని మేము భావించడం కూడా ఉన్నది.

ఈ విధంగా చెప్పదగిన గొప్పతనం ఈ భాష్యానికి ఉన్నదనే విషయాన్ని ఇక్కడ కొంచెం నిరూపించి చెప్పాలనే ఉద్దేశంతో సహస్రనామంలో

ఉండే కొన్ని నామాలను ప్రస్తావించి, ఇతర భాష్యాలలో కంటే భట్టర్ అనుగ్రహించిన భాష్యంలో ఉండే స్వారస్యాతిశయాన్ని దివ్య ప్రబంధసూక్తులలో రాసిక్యాన్ని కలవారికోసం అందంగా నిరూపించి చూపిస్తాము.

"సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః" అనే చోట "సత్కృతిః" అనే తిరునామానికి ఇతరులు చెప్పిన అర్థం ఏమంటే –జగత్ సృష్టి మొదలైన గొప్ప కార్యాలను చేసేవాడు– అని వారు చెప్పారు. అయితే, ఈ అర్థాన్ని భట్టర్ ఆదరించలేదు. ఇంతకుముందు స్తోత్రంలో, "వసుప్రదో వాసుదేవః వసుః వసుమనా హవిః" అని వాసుదేవనామశ్రవణం ఉన్నందున, ఈ ప్రకరణంలో ఉండే పలు తిరునామాలు వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుని గుణ చేస్తితాలను తెలుపుతున్నాయని భావించి, "వసురేతాః" అనే నామంనుండి పలు నామాలను కృష్ణావతారగుణప్రతిపాదకాలుగా భట్టర్ వ్యాఖ్యానం చేశారు. స్పష్టంగా ఈ విధంగానే అవతారికను కూడా అనుగ్రహించారు. "సత్కృతిః" అనే తిరునామం ఆ ప్రకరణంలో ఉన్నందున, దీనికి ఇతరులు చెప్పిన అర్థం విరసమని భావించి, పెరుగు, వెన్న మొదలైనవానిని దొంగిలించి, రోటికి కట్టబడి, దండింపబడడం, గొల్ల కన్నియలతో రాసక్రీడను ఆడడం మొదలైన గొప్ప లీలలను చేయడం అనే అందమైన అర్థాన్ని భట్టర్ తెలియజేశారు. తిరుప్పావై ప్రబంధంలో "ఉందన్నై చ్చిఱు పేరழைత్తనవుమ్ శీఱి అరుళాదే" (నిన్ను చిన్న పేరుతో పిలిచానని నీవు కోపగించుకోవద్దు)అని అన్నది. "శ్రీకృష్ణా! నీకు ఎన్నెన్నో పేర్లు ఉండగా, వాటిని విడిచిపెట్టి, చిన్న పేరును పెట్టి నిన్ను పిలిచినందుకు నీవు కోపగించుకోకూడదు" అని ఇక్కడ గోదాదేవి క్షమను ప్రార్థించింది. ఇక్కడ చిన్న పేరుగా భావింపబడేది ఏది? అని విచారించినప్పుడు,

భట్టర్ శ్రీచరణాలలో అర్థాలను విన్న మన పూర్వాచార్యులు "నారాయణుడు, దేవాధిదేవుడు మొదలైన నామాలు చిన్న పేర్లు—అని, గోవిందుడు, గోపాలుడు మొదలైన పేర్లు పెద్ద పేర్లు అని అంటున్నారు". ఎందుకంటే, అతడు ఆనందించే తిరనామం ఏదో, అదే గొప్పతనాన్ని కలిగిన నామం— అని ఏర్పడుతున్నది. అతడు కాదనుకొనే పేరే చిన్న పేరు అవుతుంది— అని చెప్పవలసి ఉన్నది. రేపల్లెలో గొల్లలకు నాయకుడై వచ్చి పుట్టి గోవులను లేగదూడలను మేపి, గొప్పతనాన్ని పొందాలని భావించినందున, "కన్రు మెయ్ త్తు ఇనిదు ఉకంద కాళాయ్! (లేగ దూడలను మేపి, ఆనందించిన వృషభంవంటివాడా!) అని సంబోధిస్తే అతని మనసు ఆనందిస్తుంది తప్ప, "నారాయణా! వైకుంఠవాసా! " అని అంటే ఆనందం కలుగుతుందా? చాలా చాలా వెగటుగా కదా ఉంటుంది. గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా ఎత్తినప్పుడు ఆ అతిమానుష చేష్టితాన్ని చూచి, చాలా సందేహాన్ని పొందినవారై, "దేవో వా?" (నీవు దేవుడవా?) అని రేపల్లెలో ఉండేవారంతా అనగా, దానికి చాలా కోపగించాడుకదా, శ్రీకృష్ణుడు. "వీరిలో ఒకడనై ఉండే నన్ను దేవుడని నిందిస్తున్నారే, ఈ పాపిష్టివారు! " అని కదా ఆ మహానుభావుడు కోపగించాడు. వీటికి అన్నిటికి చక్కగా తగినట్లుగా కదా పలకాలి, "నారాయణనే నమక్కే పఱై తరువాన్" (నారాయణుడే మనకు ప్రాప్యాన్ని అనుగ్రహిస్తాడు)అని, "నాఱ్ఱత్తుழాయ్ ముడి నారాయణన్" (సువాసనను కల తులసిని కిరీటంలో కలిగిన నారాయణుడు) అని అన్యాయంగా నిన్ను చిన్న పేరును పెట్టి సంబోధించి పలికామే! గోవిందా! గోపాలా! అనే పెద్ద పేర్లను పెట్టి చెప్పకుండా నిన్ను నిందించినందుకు మమ్ములను క్షమించాలి" అని చెప్పడం కోసం గోదాదేవి పలుకుతున్నట్లుగా అర్థాన్ని గ్రహించడమే తగినది— అని భావించి పూర్వాచార్యులు ఈ విధంగా

వ్యాఖ్యానించారు. ఈ స్వారస్యాన్ని తెలియని భాగ్యహీనులు ఈనాటికి దీనికీ విపరీతమైన అర్థాన్ని వ్రాసి చెబుతూ ఉండడాన్ని గమనిస్తున్నాం. ఈ విషయం అటు ఉండనివ్వండి. రసికులు "సత్కృతిః" అనే నామానికి భట్టర్ భాష్యం ఉండే అందాన్ని గమనించాలి. జగత్సృష్టి మొదలైన వ్యాపారాలు భగవంతుని గొప్ప కార్యాలు– అని అంటున్నారు, శంకరాచార్యులవారు. అవి గొప్పవి కావు, "నెంజాల్ నినైప్పు అరిదాల్! వెణ్ణెయ్ ఊణెన్నుమీనచ్చొల్లే" అని, "కానాయన్ కడిమనైయిల్ నెయ్ పరుగ" అని చెప్పబడే నవనీత చౌర్యాది వృత్తాంతాలే గొప్పవి –అని, "మన అళ్వార్లు అభినివేశాన్ని పొందే రీతిలోని ఆ సత్కార్యాలే గొప్పవి" అని అంటున్నారు, భట్టర్. "మత్తుఱు కడైవెణ్ణెయ్ కళవినిల్ ఉరవిడై యాప్పుండు ఎత్తిఱమ్! ఉఱలినోడు ఇణైందిరుందు ఏంగియ వెళివే" (కవ్వంతో చిలికిన వెన్నను దొంగిలించి, దానివల్ల రోటికి కట్టబడి, కొట్టబడి, వెక్కి వెక్కి ఏడ్చిన శ్రీకృష్ణుని సౌలభ్యప్రకారం, ఆహా! ఎంత గొప్పది!) అని నమ్మాళ్వారులు ఆరు నెలల కాలం మోహాన్ని పొందిన లీలను పురస్కరించుకోకుండా, వేరొక అర్థంతోనా, భగవంతుని "సత్కృతిః" అని అనాలి! – అని భట్టర్ అభిప్రాయపడుతున్నారు.

ఇప్పుడు ఇంకొక నామాన్ని చూద్దాం. "విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిః ఛిన్నసంశయః, ఉదీర్ణః సర్వతః చక్షుః అనీశః శాశ్వతః స్థిరః" అనే సందర్భంలో ఉండే పలు నామాలకు ఇతరుల భాష్యంలో స్వారస్యం లేకపోవడం, భట్టర్ భాష్యంలో స్వారస్యం నిండుగా ఉండడం నిరూపిస్తాను. "విధేయత్మా" –అనేదానికి "మనస్సును నియంత్రించుకున్నవాడు, జితేంద్రుడు" అని ఇతరులు వివరించారు ఇందులో ఏమి అందం ఉన్నది? స్వారశస్యం ఉన్నది?

తమ పాదాలను ఆశ్రయించినవారి విషయంలో తాను తక్కువగా ఉండి, విజయాన్ని వారికి కలిగించి, తనకు అపజయాన్ని గ్రహించేవాడు– అనే అభిప్రాయాన్ని భట్టర్ వివరించారు. ఇది కదా! భగవంతుడు ఆనందించే అర్థం. "ఆడిచ్చియోమ్ తలైమిశై ని అణియాయ్ ఆ*ఝ్రి*యమ్ కణ్ణా! ఉన్ కోల ప్పాదమ్" (శ్రీకృష్ణా! నీ అందమైన శ్రీచరణాన్ని దాసురాంద్రమైన మా తలలపై ఆభరణంగా పెట్టు)- అని భక్తులు కోరుతూ ఉండగా, "మమ శిరసి మండనమ్ గోపికా దండనమ్" (గోపికలు చేసే దండన నా శిరస్సుకు ఆభరణం) అని పలికే అర్థం ఆ భగవంతుని మనస్సును ఆనందింప చేసే వ్యాఖ్యానం కదా. " కూడారై వెల్లుమ్ శీర్ గోవిందా! " అని గోదాదేవి పలికిన పాశురానికి, ఆ ప్రయోగం లోపల ఉండే అర్థాన్ని గ్రహించి వ్యాఖ్యానం చేసే మన పూర్వాచార్యులు "కూడాదవర్ కళై తోఱ్కడిప్పదుమ్, కూడుమవర్ క్కు నీ తో*ఱ్ఱ*రుప్పదుమ్ అన్టో! ఉన్ ఇయల్ వు! " (నీతో చేరనివారిని నీవు జయించడం, నీతో చేరినవారికి నీవు ఓడిపోవడం కదా, నీ స్వభావం!) అనే భావాన్ని వివరించారు దానికి మార్గదర్శనం చేసేటట్లుగా ఉన్నది, ఇక్కడ భట్టర్ భాష్యం.

తరువాత అనంతర నామాన్ని చూద్దాం. "విజితాత్మా విధేయత్మా" అనే చోట అకారప్రశ్లేష ఉన్నదని భావించి, "అవిధేయాత్మా" అని పదవిభాగాన్ని చేసి, దానికి తగిన అర్థాన్ని ఇతరులు చెప్పారు. "ఎవరికీ విధేయం కాని స్వరూపాన్ని కలవాడ"ని వారు వివరించారు. కానీ, భట్టర్ ఆ విధంగా కాకుండా, " విధేయాత్మా "అనే ఈ తిరునామాన్ని గ్రహించి, "నిలువడం, కూర్చోవడం, శయనించడం, వెళ్లడం, రావడం, భుజించడం మొదలైనవి కార్యాలలో అన్నిటిలోనూ భక్తుల కట్టడికి వశమై ఉండే స్వరూపం

కలవాడు"— అనే అందమైన అర్థాన్ని వివరించారు. "కణి క్కణ్ణన్ పోకిన్టాన్ కామరు పూమ్ కచ్చి మణివణ్ణా! నీ కిడక్కవేండా, నీయుమ్ ఉన్టన్ పైన్నాగప్పాయ్ శురుట్టిక్కొళ్" (కణిక్కణ్ణన్ వెళ్ళిపోతున్నాడు, అందమైన పూలను కలిగిన కంచిలో వేంచేసి ఉండే మణివర్ణా! నీవు ఇక ఇక్కడ పరుండ వద్దు. నీవు కూడా నీ ఆదిశేష శయనాన్ని చుట్టుకొని బయలుదేరి రా) అని అంటే వెంటనే తన ఆదిశేష శయనాన్ని చుట్టుకొని బయలుదేరినవాడు, "పైన్నాగప్పాయ్ విరిత్తుక్కొళ్" (నీ ఆదిశేషశయనాన్ని పరుచుకొని పరుండు) అని అంటే ఆ విధంగానే ఆచరించినవాడు, తిరుమழிశైప్పిరాన్ చెప్పినది అంతా చేసి, "యథోక్తకారి" అనే నామాన్ని పొంది, భక్తవిధేయుడై, ఉండేవాడైన భగవంతుని మనస్సు ఆనందించాలి అంటే "విధేయత్మా" అనేదానిని వేరు విధంగా గ్రహించడానికి అవకాశం ఉన్నదా? "జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్" (జ్ఞాని అయినవాడు నాకు ఆత్మ —అని నా అభిప్రాయం) అని గీతలో పలికిన భగవంతుని అభిప్రాయం ఏమి? జ్ఞానులకు నేను శరీరభూతుడను—అని సర్వశరీరియైన భగవంతుడు తానే నోరు తెరచి పలుకుతున్నాడు. ఆత్మనుగూర్చి సర్వాత్మనా విధేయంగా ఉండడమే కదా, శరీర లక్షణం. జ్ఞానులకు తాను విధేయుడు కాకుండా ఉంటే, "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని అతడు తానే చెప్పడం, మన పూర్వాచార్యులు దానికి అనుగుణంగా వ్యాఖ్యానం చేయడం అంతా ఏమవుతుంది? నోటితో చెప్పడమే కాకుండా, చేసి చూపిస్తున్నాడు కదా భగవంతుడు. "సేనయో రుభయోః మధ్యే రథం స్థాపయ మే ఽ చ్యుత! " (శ్రీకృష్ణా! రెండు సేనలకు మధ్యగా నా రథాన్ని నిలుపు) అని అర్జునుడు నియమిస్తే, ఆ విధంగానే తాను చేయడానికి అనుగుణంగా కదా,

స్వామి తనను మలచుకున్నాడు. "పార్థసారథి" అనే పేరును పొంది కదా, అతడు ప్రకాశిస్తున్నాడు.

ఇప్పుడు అనంతర నామాన్ని చూద్దాం. "ఛిన్నసంశయః" అనేది ఇంకొక నామం. "అన్నిటినీ కరతలామలకంగా, ఎల్లప్పుడూ చూస్తున్నాడు కనుక, సందేహం లేనివాడు" అనే భావంలో ఇతరులు భాష్యాన్ని రచించారు. సందేహం, భ్రమ, విస్మృతి మొదలైనవి లేకపోవడం జ్ఞానానికి అతిశయం. అందుచేత, భగవంతుడు అతిశయించిన జ్ఞానాన్ని కలవాడు —అని చెప్పినట్లయినది. అయితే, ఈ అర్థం సహస్రనామంలో ఇంకా అనేక తిరునామాల ద్వారా వ్యక్తం చేయబడినది. అందువల్ల ఇందులో కొత్త స్వారస్యం ఏమీ లేదు— అని భావించిన భట్టర్, దీనిని అందంగా, వేరు రీతిలో వ్యాఖ్యానించారు. దీనికి ముందు ఉండే "సత్కీర్తిః" అనే నామానికి ఇతరులవలె సామాన్యమైన అర్థాన్ని చెప్పకుండా, "సౌలభ్యం ఉన్నందున యథార్థమైన కీర్తిని కలవాడు" అని ప్రస్తుత సందర్భానికి అనుగుణంగా అర్థాన్ని చెప్పినవారు కనుక, "ఛిన్న సంశయః" అనే ఈ తిరునామానికికూడా దానిని అనుసరించి, అందమైన అర్థాన్ని తెలియజేస్తున్నారు. అది ఏమంటే— భగవంతుని విషయంలో స్పష్టమైన జ్ఞానం లేనివారికి అనేకవిధాలైన సందేహాలు కలుగుతాయట. భగవంతుడు తెలియదగినవాడా? తెలియదగనివాడా?సులభుడా? దుర్లభుడా? మనకు వశమై ఉండేవాడా? వశం కానివాడా? — అని ఈ విధంగా ఎన్నో సందేహాలు కలుగుతాయట. వాటిని తన ప్రవర్తనతో వెంటనే భగవంతుడు పోగొడతాడట. తాను దారిద్ర్యం లేకుండా ఉండేవాడు— అనే విషయం కంటే, ఇతరులను దారిద్ర్యం లేనివారుగా చేసేవాడు— అనేది ఏ విధంగా గొప్పదో, ఆ విధంగానే,

తాను సందేహం లేకుండా ఉండేవాడు— అనేదాని కంటే, ఇతరులను సందేహాలు లేనివారుగా చేసేవాడు— అనేది గొప్పది అని వివరించి చెప్పాలా! అందులోనూ, తన పరత్వాన్ని చూపించి సందేహాన్ని పోగొడతాడు— అని అనకుండా, తన సౌలభ్యాన్ని చూపించి సందేహాన్ని పోగొడతాడు— అనేది రసవత్తరం.

ఇక్కడే "అనీశః" తిరునామంలోని భాష్యాన్ని గమనించాలి. తనకు మించిన ఈశ్వరుడు వేరొకనిని లేనివాడు, కనుక అనీశుడు— అని దీనిని ఇతరులు వ్యాఖ్యానించారు. తనకు తాను స్వాధీనం కానివాడు, భక్తపరాధీనత చేత స్వాతంత్ర్యం లేనివాడు కనుక, అనీశుడు— అని వ్యాఖ్యానించారు భట్టర్. "విల్లిపుదువై విట్టు శిత్తర్ తంగళ్ దేవరై వల్ల పరిశు వరువిప్పర్" (శ్రీవిల్లిపుత్తూరులో ఉండే విష్ణుచిత్తులు తమకు ప్రభువైన భగవంతుని తగిన ఉపాయంతో అనుగ్రహింప చేస్తారు)అని గోదాదేవి పలికినట్లుగా, భక్తులు వేడినీళ్ళను కాచి, "నారణా! నీరాడ వారాయ్! " (నారాయణా! స్నానం చేయడానికి రా) అని, "ఇన్ను నీ నీరాడవేండుమ్ ఎంబిరాన్! ఓడాదే వారాయ్" (ఈ నాడు నీవు స్నానం చేయాలి, స్వామీ! పరిగెత్తుకొని పోకుండా రా) అని పిలిస్తే, స్నానం చేయడానికి రావడం, కొన్ని పువ్వులను కోసి, చేతిలో పెట్టుకొని, "శెణ్బకప్పూచ్చూట్ట వారాయ్, మల్లిగై పూచ్చూట్ట వారాయ్" (సంపెంగలను అలంకరించుకోవడం కోసం రా, మల్లె పువ్వులను అలంకరించుకోవడం కోసం రా) అని పిలిస్తే, పువ్వులను ముడుచుకోవడం కోసం వచ్చేవాడైన భగవంతుని ముఖాన్ని ఏ భాష్యం ఆనందింప చేస్తుందో గమనించండి.

ఇంకొక నామాన్ని చూద్దాం. "వసుః వసుమనాః సత్యః సమాత్మా సంమితః సమః" అనే చోట "అసంమితః" అని పదవిభాగాన్ని చేసి, "పరిచ్ఛిన్నుడు" అనే అర్థాన్ని ఇతరులు చూపించారు. వెలను ఇచ్చి, పనిని పొందేటట్లుగా, లేని రీతిలో లేని ఒక ఆకారాన్ని ఆరోపించి, ఇటువంటి ఈ అర్థాన్ని ఎందుకు చెప్పాలి? అని నిర్వేదాన్ని పొందిన భట్టర్, "అన్ని విధాలుగాను భక్తులకు పరిచ్ఛిన్నుడై ఉండేవాడు"– అనే అర్థాన్ని "సంమితః" అనే రూపాన్ని గ్రహించి, తెలియజేశారు. "అழுకైయుమ్ అంజునోక్కుమ్ అన్నోక్కుమ్ అణి కొళ్ శెమ్ శిఱు వాయ్ వెళిప్పదువుమ్, తొழுకైయుమ్ ఇవై కండ యశోదై తొల్లై ఇన్బత్తిఱుది కండాళే" (శ్రీకృష్ణుడు ఏడవడం, భయంతో చూడడం, అటు ఇటు చూడడం, అతని అందమైన చిన్న పెదవి అదరడం, నమస్కరించడం అనే వీటిని అన్నిటిని చూచిన యశోదా దేవి అనాది అయిన, అంతు లేని ఆనందం అనుభవించింది) అనే పెరుమాళ్ తిరుమొழி పాశురంలో "తొల్లై ఇన్బత్తిఱుది కండాళే" (అంతు లేని ఆనందాన్ని అనుభవించింది) అనేదానికి అంతు లేనివాడనే భగవంతుని (అపరిచ్ఛిన్నుడు అని చెప్పడానికి ఎదురుగా) పరిచ్ఛిన్నునిగా యశోద దర్శించింది– అని పూర్వాచార్యులు పలికే అర్థానికి ఆధారం ఈ భట్టర్ భాష్యసూక్తియే.

"నియంతా నియమో యమః" అనే చోట, "ఆధారనిలయో ధాతా" అనే చోట "అనియమః, నియమః", "అయమః, యమః", "అధాతా, ధాతా" అని రెండు విధాలుగా పదవిభాగం చేసి వ్యాఖ్యానాన్ని ఇతరులు చేశారు. ఈ విధంగానే, "విజితాత్మా, విధేయాత్మా" అనే చోట, "సమాత్మా, సంమితః సమః" అనే చోట కూడా ఆ విధంగానే రెండు విధాలుగా పదవిభాగం చేసి, రెండు

విధాలైన అర్థాలను చెప్పే అవకాశం ఉన్నా, ఎందుకు ఆ విధంగా ఇతరులు చెప్పలేదు? అని విచారిస్తే, భగవద్గుణాలలో అవగాహనను పొందడానికి తగినట్లుగా దివ్యసూరిప్రబంధ వచనామృతసాగరంలో అవగాహన భట్టర్ కు ఉన్నట్లుగా, ఇతరులకు లేకపోవడమే కారణం అని– శ్రీవైష్ణవులు సులభంగా నిశ్చయించుకోవచ్చు.

పరత్వం, సౌలభ్యం అనే రెండు విధాలైన రీతులకు తగినట్లుగా ఉండే గొప్పతనాలు భగవంతునిలో ఉన్నాయి. ఈ రెండిటిని అనుభవించడానికి మనం పెట్టి పుట్టాము. అయినప్పటికీ, అనుభవంలో మనస్సు ద్రవించేటట్లు చేసేవి భగవంతుని సౌలభ్య గుణాలు తప్ప, పరత్వ గుణాలు కావు.

నమ్మాళ్వారులు తిరువాయ్ మొ*ళ్ళి* ప్రబంధం ఆరంభంలో "ఉయర్వఱ ఉయర్ నలముడైయవన్" (అంతు లేని వైభవాన్ని కలిగిన కళ్యాణగుణాలను కలవాడు) అని ఆరంభించి, భగవంతుని పరత్వాన్ని అనుభవించినవారైనా, కొంచెం కూడా వ్యామోహాన్ని పొందకుండానే సూక్తులను పలికారు, వారే. "ఎత్తిఱమ్! ఉరలినోడు ఇణైందిరుంది ఏంగియ వెళివే" (రోలుకు కట్టబడి వెక్కి వెక్కి ఏడ్చిన శ్రీకృష్ణుని సౌలభ్యప్రకారం ఎంత గొప్పది! ఆహా!), "పిఱంద వాఱుమ్ వళర్ న్దవాఱుమ్" (శ్రీకృష్ణుడు అవతరించిన రీతి, పెరిగిన రీతి ఎంత ఆశ్చర్యకరం!) అని మిక్కిలి అభినివేశాన్ని పొంది, ఆరు నెలల కాలం మోహించి, తెలివి లేకుండా పడి ఉన్నారు. అందువల్లనే, కురేశులు అతిమానుషస్తవంలో "తాదృశ్నా తే చరిత మార్యజనాః సహంతే" (అటువంటి నీ చరిత్రలను ఆర్యజనులైన ఆళ్వారులవంటివారు విని తట్టుకోలేకుండా

ఉన్నారు) అని, "ఆర్ద్రీకరోతి విదుషాం హృదయం తదేతత్" (ఈ నీ చరిత్రలు పండితులైన ఆళ్వార్లవంటివారి హృదయాలను ద్రవింప చేస్తున్నాయి) అని అనుగ్రహించారు అందుచేతనే సౌలభ్య గుణాలనే ఎక్కువగా వివరించడంలో ఆచార్యులు కుతూహలాన్ని పొందారు. ఇదే ఆళ్వారులు చూపించిన మార్గమని భావించి, ఈ విధంగా వివరించారు. ఇందువల్ల పరత్వానికి మూలమైన గుణాలలో వీరు పగను, అసహనాన్ని కలవారని అర్థం కాదు. ఆ గుణాలనుకూడా వారు అపరిమితంగా అనుగ్రహిస్తూనే ఉంటారు. సౌలభ్య గుణాలను అనుభవించే సందర్భం లభించినట్లయితే, ఆ సందర్భంలో సౌలభ్య గుణాలను విశేషంగా అనుభవిస్తారు— అనేదే ఇక్కడ గమనించవలసిన విషయం.

మనసును ద్రవింపజేసే అర్థవిశేషాలను అనుగ్రహించడంలో భగవద్రామానుజుల కంటే భట్టర్ చాలా సమర్థులు—అని భగవద్విషయ దివ్య గ్రంథాన్ని అనుభవించిన వారికి స్పష్టంగా తెలుస్తుంది. మహా మేధావి అయిన వీరి బుద్ధికి అనాయాసంగా గోచరించే అర్థం మిగిలినవారి బుద్ధికి "శ్రమపడి గ్రహించాలి" అన్నా సాధ్యం కాదు —అని అంటే, ఇది అతిశయోక్తి కానే కాదు. కొన్ని సందర్భాలతో దీనిని ఉదాహరిస్తాను.

ఈ సహస్రనామంలోనే "అర్థో ౽ నర్థో మహాకోశః" అనే చోట "అనర్థః" అనే తిరునామాన్ని వ్యాఖ్యానించే ఇతరులు, "మనం కోరవలసిన విషయం కానివాడు", – అని వ్యాఖ్యానించారు. ఇది మనవంటివారికికూడా తోచే అర్థమే. భట్టర్ అనుగ్రహించిన అర్థం ఏమంటే, "అల్పఫలాలను కోరే భాగ్యహీనులచే ఆశపడనివాడు" అనే అర్థాన్ని చెప్పారు. తరువాత ఉండే "మహాకోశః" అనే

తిరునామానికి అన్నమయ ప్రాణమయాదులైన ఐదు మహాకోశాలలో ఉండేవాడు– అనే అర్థం ఇతరులచే తెలుపబడింది. తనను ప్రార్థించే భక్తులకు అంతు లేకుండా ఇచ్చినప్పటికీ కూడా, ఏనాటికీ కొరత లేకుండా ఉండే నవనిధులను, రత్నాకరాలను తన బొక్కసంలో కలవాడు– అని భట్టర్ దీనికి అర్థాన్ని చెప్పారు. ఈ విధంగా, మనం ఉదాహరించి అనుభవించదగిన అద్భుతమైన అర్థాలు భట్టర్ అనుగ్రహించిన సహస్రనామభాష్యంలో అంతు లేకుండా ప్రకాశిస్తున్నాయి.

# తిరుప్పాణాళ్వార్

వీరు, కార్తీక (వృశ్చిక) మాసంలో రోహిణీనక్షత్రంలో ఉఱైయూర్ అనే దివ్యదేశంలో అవతరించారు. వీరి చరిత్ర లోకంలో అంతటా ప్రసిద్ధమైనది. వీరు అవతార పురుషులై ఉన్నప్పటికీ, తమ జాతిస్వభావానికి తగినట్లుగా శాస్త్రమర్యాదను దాటకుండా వర్తిస్తూ వచ్చారు. వీరు లోకవిలక్షణమైన ఉత్తమ వ్యక్తి— అనే విషయాన్ని లోకానికి చూపగోరిన శ్రీరంగనాథుడు వీరికి మునివాహనులు అనే తిరునామం చిరకాలం వెలిగేటట్లు చేసి, లోకసారంగ ముని అనే ఒక ఉత్తమాశ్రమి భుజాలపై అధిరోహించేటట్లు చేసి, వీరిని తమ దగ్గరకు పిలిపించుకుని, "అండర్ కోన్ అణి యరంగన్ ఎన్నముదినై క్కండ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై క్కాణావే" (బ్రహ్మాండానికి అధిపతి, అందమైన శ్రీరంగంలో ఉండేవాడు, నాకు అమృతంవంటివాడైన శ్రీరంగనాథుని చూసిన నా నేత్రాలు ఇంకొక వస్తువును దేనినీ చూడవు) అనే పాశురాన్ని పాడిన పూర్తి చేసిన వెంటనే, వీరు తన తిరుమేనిలోనే లయించేటట్లు అనుగ్రహించిన అద్భుతం వీరికి మాత్రమే కల విలక్షణమైన అతిశయం.

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని "పుళ్ళుమ్ శిలంబిన కాణ్" అనే ఆరవ పాశురం మొదలుకొని 10 పాశురాలతో ఆళ్వారులను పదిమందిని నిద్ర లేపుతున్నట్లు ఒక అనుభవం ఉన్నది కదా. ఆ క్రమంలో "ఉంగళ్ పుழைక్కడై త్తోట్టత్తు వావియుళ్" అనే 14వ పాశురం ఈ తిరుప్పాణ్ ఆళ్వారుల వైభవాలను చాలా అందంగా వివరిస్తున్నది— అనే విషయాన్ని ఇక్కడ తెలియాలి. ఆ విషయం కొంచెం వివరింపబడుతున్నది.

ఈ పాశురంలో "నంగాయ్! నాణాదాయ్! నావుడైయాయ్! " అనే మూడు సంబోధనలు ఉన్నాయి. ఇవి మూడు కూడా ఈ ఆళ్వారులకు చక్కగా పొసగుతాయి.

"నంగాయ్! " అనే సంబోధన "గుణపూర్తి కలిగినదానా! " అనే అర్థాన్ని తెలుపుతున్నది శ్రీరంగనాథుని ఆజ్ఞతో లోకసారంగమహాముని వీరి దగ్గరకు వచ్చి, "నా భుజాలపై ఎక్కి అధిరోహించండి" అని అనగా, మీరు ఎక్కడ? నేనెక్కడ? "నీశనేన్, నిఱై ఒన్రుమిలేన్" – (నీచుడను ఏ గుణాలను లేనివాడను) అయిన నేను మీ దగ్గరకు కూడా కాకూడదు కదా! అని పలికి వెనుకకు జంకి, పరిగెత్తుకొని పోకుండా, తమ అత్యంత పారతంత్ర్య స్వరూపాన్ని భావించి, దానికి తగినట్లు లోకసారంగముని చెప్పిన మాటకు అంగీకరించడం వీరి గుణపూర్తిని చక్కగా తెలుపుతుంది.

ఆ విధంగా బ్రాహ్మణోత్తములైన ఆ ముని భుజాలపై అధిరోహించినప్పటికీ, కొంచెం కూడా గర్వాన్ని పొందకుండా, "అడియార్ క్కు ఎన్నై ఆట్పడుత్త విమలన్" (భగవద్భక్తులకు తనను దాసుడుగా చేసిన విమలుడు, భగవంతుడు) అని కదా వారు తమ ప్రబంధంలో పాడారు. కనుక, "నాణాదాయ్! " అనే సంబోధన కూడా చాలా చక్కగా వీరి విషయంలో అన్వయిస్తుంది. "నాణ్" అంటే అహంకారం.

"పాణ్ పెరుమాళ్ పాడియదోర్ పాడల్పత్తుమ్ పழుయ మఱైయిన్ పొరుళెన్రు పరువుమిన్ గళ్" (తిరుప్పాణ్ ఆళ్వార్లు పాడిన, అద్వితీయమైన పాశురాలు పది అనాది అయిన వేదంలోని అర్థమే– అని చెప్పండి) అని

వేదాంతదేశికులు పలికినట్లుగా, సకల వేదార్థాలను పది పాశురాలలో ఇమిడ్చి పలికిన పరమ చాతుర్యంచేత "నావుడైయాయ్! " అనే సంబోధన కూడా వీరికే చక్కగా వీరికి సరిపోతుంది.

అమలనాది పిరన్ ప్రబంధంలో "కైయినార్ శురిశంగనలా*ళ్లి*యర్" అని శ్రీరంగనాథుడు సుదర్శనపాంచజన్యాలను ధరించిన అందాన్ని, "కరియ వాగి పుడై పరందు మిళిర్ న్దు శెవ్వరియోడు నీండ అప్పెరియవాయ కణ్ గళ్ ఎన్నై ప్పేదమై శెయ్ దనవే" (నల్లనివై, చివరి వరకు వ్యాపించి, మెరిసి, ఎర్రని రేఖలను చివరి కలిగిన, దీర్ఘమైన, ఆ పెద్ద శ్రీరంగనాథుని కన్నులు నన్ను వ్యామోహాన్ని పొందేటట్లు చేశాయి) అని స్వామి పుండరీక నేత్రాల గొప్పతనాన్ని ఈ ఆళ్వారులు విశేషించి పలికినందున, దానికి తగినట్లుగా, ఈ తిరుప్పావై పాశురంలో "శంగొడు శక్కర మేందుమ్ తడైక్కైయన్ పంగయ క్కణ్ణానై ప్పాడ" (శంఖంతో పాటు చక్రాన్ని ధరించే, విశాలమైన భుజాలను కలిగిన పుండరీకాక్షుని కీర్తించడం కోసం) అని చెప్పబడింది.

ఈ ఆళ్వార్లు తమ జాతిస్వభావానికి తగినట్లు జీవించిన చోటును తెలుపుతున్నది– "ఉంగళ్ పు*ళ్లై*క్కడై తోట్టత్తు వావియుళ్" (మీ పెరటి తోటలోని బావిలోపల) అనే ప్రయోగం. అక్కడ లోకసారంగ మహాముని తమ నోటిని తెరచి పలు వచనాలను పలకడం, ఈ ఆళ్వార్లు తమ అపరాధానికి జంకి, తమ నోటిని మూసుకోవడం ధ్వనించేటట్లు "శంగె*ళ్లు* నీర్ వాయ్ నిక*ళ్లి* న్దు అంబల్వాయ్ కూంబిన కాణ్! " (తామరలు పూచాయి, కలువలు మూసి కొన్నాయి) అని చెప్పబడింది. లోకసారంగ మహాముని స్వభావాన్ని

తెలుపుతున్నది– "శెంగల్పొడి క్కూరై వెణ్ పల్ తవత్తవర్" (కావి రంగు వస్త్రాలను కలిగినవారు, తెల్లని దంతాలను కలిగినవారు అయిన తపోనిధులు) అనేది. లోకసారంగముని ఈ ఆళ్వార్లను కోవెలలో పలికి తీసుకుని పోవడానికి తెలుపుతున్నది– "తంగళ్ తిరుక్కోయిల్ శంగిడువాన్ పోగిన్దార్" (తమ దివ్యాలయాలలో శంఖాన్ని ఊదడం కోసం పోతున్నారు) అనే ప్రయోగం.

"ఎంగళై మున్నమ్ ఎழుప్పువాన్ వాయ్ పేశుమ్ నంగాయ్! " (మమ్మలను ముందుగా నిద్ర లేపుతాను– అని నోటితో పలికే గుణపూర్ణురాలా!) అనే ప్రయోగంలో ఒక అందమైన అర్థం ధ్వనిస్తున్నది అది ఏమంటే– ఇక్కడ "ఎழుప్పువాన్" అంటే– తన భుజాలలో పైకెత్తుకొని మోయడం– అని అర్థం. "ఎంగళై" అనే పదం భాగవతులను తెలుపుతుంది. "తిరుప్పాణ్ ఆళ్వార్లూ"! మీ మొదటి పాశురంలో "ఆడియార్ క్కు ఎన్నై ఆళ్ పడుత్త విమలన్" (భగవత్ భక్తులకు నన్ను దాసునిగా చేసిన విమలుడు– అని చెప్పడాన్ని గమనించినప్పుడు, భాగవతులను మీరు మీ భుజాలపై మోసుకొని పోతున్నట్లుగా ధ్వనిస్తున్నది. అయితే, మీ చరిత్రం దీనికి విపరీతంగా ఉన్నది. "మహాభాగవతులైన లోకసారంగ మహాముని భుజాలపై అధిరోహించి కదా, మీరు ఉన్నారు, అందుచేత, మునుముందుగా భాగవత శేషత్వాన్ని మీరు చెప్పడం, నోటితో చెప్పడం వరకే సుమా! " అని వినోదంగా పలికిన చమత్కారం తోస్తున్నది.

# విద్యాదానమహిమ

విద్యాదానం అనే పదం రెండు విధాలైన అర్థాలను ఇస్తుంది. "కర్తృకర్మణోః కృతిః "అనేది వ్యాకరణ సూత్రం కనుక విద్యాకర్మకమైన దానం అని, విద్యాకర్తృకమైన దానం అని రెండు విధాలుగా అర్థం వస్తుంది. మహాబలిదానం అంటే, మహాబలి చేసిన దానం అని అర్థం వస్తుంది. స్వర్ణదానం, భూమి దానం అని అంటే, తత్కర్మకమైన దానం, అంటే, స్వర్ణాన్ని దానం చేయడం, భూమిని దానం చేయడం అని అర్థం వస్తుంది. ఈ విధంగా రెండు రీతులలో ఉండే అర్థాలను చెప్పడం ఆసహజం ఏమి కాదు, సర్వానుభవ సిద్ధమే.

విద్యాకర్మకమైన దానం అని అంటే, ప్రవచనం మొదలైనవాటి ద్వారా విద్యను నేర్పించడం– అని అర్థం వస్తుంది. విద్యాకర్తృకమైన దానం అని అంటే, "విద్యా దదాతి వినయమ్", అనే విధంగా విద్య అనేది తాను పొందించే ప్రయోజనాన్ని చెప్పినట్లు అవుతుంది. విద్యాదాన మహిమను ఉపన్యసించాలి అనే నియమనాన్ని పొందినవారు విద్యాకర్మకదానాన్ని మాత్రమే తెలిసి ఉంటారు. ఎందుకంటే, అటువంటి కార్యంలో వారు ప్రవర్తించినవారు కనుక. దానిని గూర్చి ముందుగా కొన్ని విషయాలు విజ్ఞాపనం చేయబడుతున్నాయి.

దానాలు అనేక విధాలుగా ఉంటాయి. అన్నదానం, భూమి దానం, వస్త్ర దానం, రజత దానం, స్వర్ణ దానం అని ఈ విధంగా చెప్పబడే గొప్ప దానాలు కొన్ని ఉన్నాయి. "అంబరమే తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్ ఎంబెరుమాన్ నందగోపాలా! " కానీ తిరుప్పావై పాశురం ప్రసిద్ధం కదా. వేదాంత దేశికులు యాదవాభ్యుదయ కావ్యంలో "అధిచకార వదాన్యమణేః శ్రియమ్ వ్యథితకల్పతరో రుపకల్పతామ్" అని అంటూ నందగోపాలుని ఔదార్యాన్ని

అపరిమితంగా కీర్తించారు. చింతామణి వలె నందుడు దానాన్ని చేశాడని, కల్పవృక్షాన్ని కూడా అతడు మించిపోయాడని ఇక్కడ చెప్పబడింది.

దానాలు అన్నిటిలోనూ అన్నదానం చాలా గొప్పదని సామాన్యంగా చెప్పబడుతుంది. ఎందుకంటే, మిగిలిన దానాలలో చాలు అనే మాట రాదు. ఎంతగా ఇచ్చినప్పటికీ తీసుకొని, ఇంకా ఇంకా ఇవ్వాలని, ఇంకా ఇంకా తీసుకోవాలని తోస్తుంది. అన్నాన్ని చేతిలో ఇచ్చినట్లయితే, ఇంకా ఇంకా తీసుకొని మూట కట్టి పెట్టుకోవాలని తోస్తుంది. కానీ. వ్యక్తులను కింద కూర్చోబెట్టి ఆకుపరచి అన్నాన్ని పెట్టి, తినమని చెప్పి అన్నాన్ని పెట్టడం ప్రారంభిస్తే, అప్పుడు తప్పకుండా కొంతసేపటికి "ఇక చాలు" అనే మాట వచ్చి తీరుతుంది. దీనిని బట్టి పెద్దలు దీనికి అలంకారం అనే పేరు పెట్టారు కాబోలు. అలం అని అంటే ఇక చాలు అని. ఇక చాలు అని అనిపించేది. అలంకారం అనబడుతుంది.

ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన అన్నదానం కాని, ఇంకా మిగిలిన ఏ దానం కాని విద్యాదానానికి ఏకదేశంలో కూడా సరిపోవు. మిగిలినవి అన్నీ కొంచెం కాలం తరువాత సహాయపడి అంతరించిపోతాయి. విద్య అటువంటిది కాదు కదా.

యజుర్వేదంలో మూడవ కాండం మొదటి ప్రశ్నలో " మనుః పుత్రేభ్యో దాయం వ్యభజత్" అని ఆరంభించి, ఒక ఉపాఖ్యానం చెప్పబడినది. అంటే, మనుమహర్షి తన పుత్రులకు దాయభాగాన్ని విభజించి ఇచ్చాడు. నాభానేదిష్ఠుడనే అతని ఒక పుత్రుడు మాత్రం వేదాన్ని అభ్యసించడానికి వేరొక ఊరికి వెళ్లి అక్కడ నివసిస్తూ ఉన్నందున, అతనికి భాగాన్ని విభజించి ఇవ్వలేదు. తరువాత, అతడు ఊరికి తిరిగి వచ్చి చేరిన తరువాత, తండ్రి తనను మాత్రం విడచి పెట్టి, మిగిలిన కుమారులకు దాయభాగాన్ని విభజించి

ఇచ్చిన విషయాన్ని తెలుసుకొని, "ఎందుకు నాకు భాగాన్ని పంచి ఇవ్వలేదు ?"అని తండ్రిని అడిగాడు. దానికి అతని తండ్రి, "నీకు నేను దాయభాగాన్ని విభజించకుండా లేను" అని పలికి, "అంగిరస ఇమే సత్రామాసతే" అని ఆరంభించి అతని చెవిలో ఒక విద్యావిశేషాన్ని ఉపదేశించి, దానిని ఉపయోగపరచవలసిన సందర్భాన్ని కూడా తెలియజేసి, " దీనివల్ల నీవు ధనికుడవు కాగలవు "అని అన్నాడు. తరువాత, ఇతనికి, రుద్రునకు మధ్య జరిగిన ఉక్తి ప్రత్యుక్తులు అటు ఉండనివ్వండి. తండ్రి అయిన మనువు ఇతనికి ఇచ్చిన విద్య ఇతనికి అనాయాసమైన జీవనోపాయం అయినది. అందుచేత విద్యాప్రదానం చేస్తే, అది శాశ్వతమైన ఉపకారం చేసినట్లు అవుతుంది.

ఒక మహాకవి ఏమని చెప్పాడు అంటే, "అంగుష్ఠాగ్రపరీణాహి జిహ్వాగ్రాయాసభీరవః, సర్వాంగీణ పరిక్లేశం సహంతే హంత! సంతతమ్" అని అన్నాడు. బొటనవేలు పరిమాణాన్ని కలిగిన నాలుకలోని భాగాన్ని చిన్నతనంలో శ్రమపెట్టడానికి భయపడేవారు, తరువాత కాలంలో వారు జీవించినంతకాలం అన్ని అవయవాలను శ్రమపెట్టి జీవించవలసినవారు అవుతారు– అని దీని అర్థం. ఇందువల్ల తెలిసిన అర్థం ఏమంటే, చిన్న వయస్సులో నాలుకలోని చిన్న భాగాన్ని శ్రమ పెట్టి విద్యను నేర్చుకుంటే, తరువాత కాలం అంతా సుఖంగా జీవితం గడపవచ్చు. ఆ విధంగా నేర్చుకోనివారు తరువాత జీవించడం కోసం అన్ని అవయవాలను శ్రమ పెట్టుకోవలసి వస్తుంది. తలతో మూటలను మోసి కాళ్లతో చాలా దూరం నడచి, చేతులతో కట్టెలను బ్రద్దలు చేయడం మొదలైన కార్యాలను చేసి, ఈ విధంగా అనేక విధాలయిన అవయవాలను శ్రమ పెట్టి జీవించవలసి ఉంటుంది. స్వల్పకాలం నాలుకలోని చిన్న భాగాన్ని మాత్రమే శ్రమపెట్టుకోవడానికి

సంకోచించినవారికి తరువాత జీవించిన కాలం అంతా ఈ విధంగా శ్రమపడి జీవించవలసి వస్తుంది. కనుక, విద్యను నేర్వడమే మంచిది అని తెలిపినట్లైనది.

అన్నదానం, వస్త్రదానం మొదలైన దానాలను ఒక క్షణ కాలంలో చేసి ముగించవచ్చు. ఆ విధంగానే, క్షణకాలంలో పొందవచ్చు కూడా. విద్యాదానం ఒక క్షణంలోనో, ఒక మాసంలోనో, ఒక సంవత్సరంలోనో చేయడానికి సాధ్యపడేది కాదు. పొందడానికి వీలైనదికూడా కాదు. ఇంతకుముందు ప్రస్తావించిన వైదికమైన ఉపాఖ్యానంలో నాభానేదిష్టుడు పొందినట్లుగా మనమందరం పొందడం సాధ్యం అవుతుందా! కాదు కదా! " వింశత్యబ్దే విశ్రుతనానావిద్యః" అనే విధంగా ఉండే అతిశయాన్ని మనం పొందే అవకాశం ఉన్నదా. ఘటికాశతం అమ్మాళ్ "అనారాధ్య కాళీ మనాస్వాద్య గౌడీం వినా మంత్రతంత్రైః" అని అంటూ పలికినట్లుగాను, " దేవీం వాచ ముపాసతే హి బహవః సారం తు సారస్వతం జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః" అనే మురారి కవి చెప్పినట్లుగాను, గురుకులంలో చిరకాలం శ్రమపడి నానావిద్యలను పొందవలసి ఉన్నది. దానికి ఎన్నో ఆటంకాలు కలుగుతాయి. " అనంతపారం బహు వేదితవ్యం ఆల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః" అని చెప్పబడుతున్నది కదా. " తస్మాత్ బాల్యే వివేకాత్మా యతేత శ్రేయసే సదా" అనే ప్రహ్లాదుడు చెప్పినట్లుగా, చిన్న వయస్సుయనుండి విద్యను అభ్యసించవలసి ఉన్నది. దానికి ఏర్పడే బహువిధాలైన అసౌకర్యాలను పోగొట్టి, ఆవశ్యకమైన సౌకర్యాలను కలుగజేసి, సద్వారకంగానూ, అద్వారకంగాను విద్యాప్రదానాన్ని చేసే మహానుభావులు గొప్పదైన తపస్సును చేసినవారు—< అని అనడంలో అడ్డు ఉన్నదా?

బెంగుళూరులోనూ తిరువల్లిక్కేణిలోను ఉభయ వేదాంత ప్రవర్ధనీ అని, వేదవేదాంతవర్ధినీ అని సభలను శాశ్వతమైన నిధితో ఏర్పాటుచేసి, వైదిక

విద్యాభివృద్ధి చేసినవి శ్రీ పరకాల మఠం, శ్రీ అహోబిలమఠంవంటి కొన్ని మఠాలు. ఈ విధంగా చేస్తూ వచ్చే ప్రయత్నాలు ప్రశంసించదగినవి కదా. "శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేః చలనకారణమ్, ఉపదేశాత్ హరిం బుద్ధ్వా విరమేత్ సర్వకర్మసు" అనే ప్రమాణవచనం ఉపదేశం పొందడంలోని ఆవశ్యకతను తెలుపడంకోసం ఏర్పడినదే తప్ప, శాస్త్ర జ్ఞానం సంపాదించనక్కరలేదు– అని నిషేధించడంకోసం వచ్చినది కాదు కదా. అది శాస్త్రజ్ఞానం లేనివారు ఉపదేశం చేయడం వీలు కాదు. పొందడమూ వీలు కాదు. "మాయాం న సేవే భద్రం తే వృథా న ధర్మమాచరే, శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్దనమ్" అనే సంజయుని మాటను ఇక్కడ స్మరించాలి.

ఈ విధంగా, ఇంతవరకు, విద్యాకర్మకమైన దానంలోని గొప్పతనం తెలియజేయడం జరిగింది. ఇక, విద్యాకర్తృక దానంలోని మహిమను తెలుపడం జరుగుతుంది. అయితే, ఇది ప్రత్యేకంగా చెప్పవలసినది కాదు. విద్య సకల హితాలను ఇవ్వగలిగినది అనేదానినిబట్టే కదా, విద్యాదానానికి మహిమ ఏర్పడింది. " విద్యా దదాతి వినయం, వినయాత్ యాతి పాత్రతామ్, పాత్రత్వాత్ ధన మాప్నోతి, ధనార్ధర్మః, తతః సుఖమ్" అనే వచనంవల్ల విద్య చేసే దానాలను తెలియవచ్చు. విద్య అహంకారానికి హేతువు కావడం కొందరి విషయంలోనే. అరకొరగా విద్యను పొందినవారికే అహంకారం కలుగుతుంది. వారు, "నేనే పండితుడను, నేనే సర్వజ్ఞుడను" అని అహంకరిస్తారు. పుష్కలంగా విద్యను పొందినవారు "నమంతి సంతః త్రైలోక్యాదపి లబ్ధుమ్ సమున్నతిమ్" అనే విధంగా తలను వంచి, అణకువతో మెలుగుతారు. శ్రీరాముడు చిత్రకూటంలో ఉన్నప్పుడు, కొండ చరియలలో పాములు ఉండే రీతిని సీతకు తెలిపే సందర్భంలో అతడు తెలిపినట్లుగా పలికే కంబ మహాకవి, ఒక్కొక్క సర్పం

ఏనుగును మింగే విధంగా ఉన్నదట. ఆ విధంగా ఉండే సర్పాలు మునులు కొండపై నుండి కిందకు దిగడానికి, వారు కింద నుండి కొండపైకి ఎక్కడానికి తగినట్లుగా మెట్లు మాదిరిగా అమరి ఉన్నవట. పరమసాధువులై వెలుగుతున్నాయట. ఈ విధంగా అవి అణకువతో ఉండడానికి ఉదాహరణను చెప్పాలని ప్రయత్నిస్తూ కంబమహాకవి. "కట్రఱిందవరెన అడంగి" (విద్యాభ్యాసం చేసి జ్ఞానాన్ని పొందినవారు అనేటట్లుగా అణకువతో ఉండి) అని అన్నారు. ఇక్కడ విద్యాభ్యాసాన్ని చేసి తెలిసినవారు– అనే సూక్తి గమనించదగినది. విద్యకు అందం వినయంవల్ల అని తెలిసినవారు– అని తాత్పర్యం. ఈ విధంగా పుష్కలమైన విద్య వినయాన్ని ఇస్తుంది. వినయం సత్పాత్రత్వాన్ని ఇస్తుంది. సత్పాత్రత్వంవల్ల సత్కారాలను పొందవచ్చు. దానివల్ల ధర్మరుచి కలుగుతుంది. దానివల్ల మహానందం కలుగుతుంది. ఇంతకంటే ఏమి కావాలి? విద్యాకర్తృకకదానం ఇటువంటి వైభవాన్ని కలిగినది కనుకనే విద్యాకర్మకదానం చాలా గొప్పది అయినది.

# భక్తితత్త్వమ్

లోకంలో కనిపించే మహాత్ములను మనం రెండు విధాలుగా వర్గీకరించి పలుకుతాం. కొందరిని మహాజ్ఞానులు అని అంటాము. మరికొందరిని మహాభక్తులు అని పొగడుతాం. పాండిత్యం, పరమ భక్తి అనేవి ఒకే వ్యక్తిలో చేరి ఉండడం అనేది అసాధ్యమైనది ఏమీ కాదు. చీకటి, వెలుగు అనే రెండు ఒకటిగా ఒకచోట చేరి ఉండడం అనేది సాధ్యం కానట్లుగా, ఈ జ్ఞానం, భక్తి అనేవి ఒకటిగా చేరి ఉండడం సాధ్యం కానివి– అని అనుకోనక్కరలేదు. మన పూర్వాచార్యులు, ఇంకా పలువురు పెద్దలు జ్ఞాన భక్తి వైరాగ్య నిధులుగా ప్రకాశించినవారే. అయితే, ఈ కాలంలో వీటిని మనం ఒకే వ్యక్తిలో దర్శించడం అనేది అరుదైపోయింది. జ్ఞానం కలిగినవారిలో భక్తి, అనుష్ఠానం కనబడడం లేదు. ఇవి కనిపించే చోట జ్ఞానాన్ని దర్శించడం అనేది అరుదైపోయింది.

లోకంలో, జ్ఞానులకు గౌరవం అధికమా? భక్తులకు గౌరవం అధికమా?అని మనం గమనిస్తే, నిజానికి భక్తిని కలవారికి గౌరవం అధికంగా ఉండాలి. అయితే, జ్ఞానులకే అధికమైన గౌరవం అక్కడక్కడ ఇవ్వడం గమనిస్తున్నాం. దీనికి కారణం ఏమి అంటే, వీరు దొంగ భక్తులా? నిజమైన భక్తులా? అని యథార్థంగా చూసి నిశ్చయించడం లేదు. విద్వాంసులు అనే వర్గంలో కూడా, నిజమైన విద్వాంసులు, ఆభాస విద్వాంసులు అనే తేడా ఉన్నప్పటికీ, వారి నోటి నుండి బయటకు వచ్చే మాటలను బట్టి వీరు నిజమైన పండితులు, వీరు దొంగ పండితులు అని తెలుసుకోవడం సాధ్యపడుతున్నది. భక్తిని కలవారిని ఈ విధంగా తెలుసుకోవడం సాధ్యం కాని కార్యంగా ఉన్నది.

భక్తులని బయటకు తెలియజేయగలిగిన వేషభూషణాధులను ధరించడం అందరికీ సులభం అవుతున్నది. కాని, మనస్సు లోపల పరిపక్వతను చెందిన భక్తి కలగడం చాలా అరుదై ఉన్నది. ద్వాదశ ఊర్ధ్వపుండ్రాలను అందంగా, స్పష్టంగా ధరించి, తులసి పూసల మాలలు, పవిత్రాలు మొదలైనవానిని ధరించి, "వీరు భాగవతోత్తములు" అని లోకంలో అందరూ ఆనందించి పొగిడేటట్టుగా వేషంతో బయటకు రావడంలో పెద్ద శ్రమ ఏమీ లేదు. ఈ విధంగానే, శిరస్సునుండి పాదం వరకు విభూదిని పూసికొని, రుద్రాక్ష మాలలను ధరించి, శివభక్తశిఖామణులుగా వెలుగడంలో కూడా కష్టం ఏమీ కాదు. కానీ, మనస్సులో దృఢంగా ఉండే పాపవాసనలను పోగొట్టుకొని, పరమేశ్వరుని విషయంలో నిజమైన భక్తిని కలిగి, తన్మయత్వాన్ని కలిగి ఉండడం అనేది ఒకటే కష్టసాధ్యం, కాలవిలంబంలో చాలా శ్రమతో పొందదగినది కూడా.

భక్తులని అనిపించే బాహ్యవేషాలను ధరించి ఉండడంతో మాత్రం ఒకడు నిజమైన భక్తుడుగా కాబోడు. అనాదికాల సంచితమైన పాపాలు పోయి, దుర్వాసనలు తొలగి, పరమ పురుషుని విషయంలో పరవశమైన భక్తి ఏర్పడినప్పుడే భక్తుడుగా కావడం సాధ్యమవుతుంది– అనే విషయాన్ని ఒక్కొక్కరూ మనస్సులో దృఢంగా పెట్టుకోవాలి. అయితే, భక్తియొక్క బాహ్యచిహ్నాలు ఆవశ్యకం కాదు– అని చెప్పడం లేదు. అవి చాలా ఆవశ్యకమే అనేదానినిగూర్చి ఇంతకుముందే తెలియజేశాను. బాహ్యచిహ్నాలను

ధరించినందువల్ల మాత్రం తృప్తిని పొందకుండా, వాస్తవమైన భక్తిని పొందడం కోసం ప్రయత్నం చేయాలి.

గొప్ప గొప్ప ధర్మకార్యాలను చేసేవారే భక్తులని కొందరు భావించవచ్చు బావులను తవ్వడం, సత్రాలను చావడులను కట్టించడం, చలువ పందిళ్ళను వేయించడంవంటి పలు ధర్మకార్యాలు చేసేవాడు భక్తుడు అని కొందరు భావించవచ్చు, అయితే, నిజం చెప్పవలసి వస్తే, ఈ కార్యాలు ఒక విధంగా గొప్పవే అయినప్పటికీ, ఈ విధమైన కార్యాలు చేసినందువల్లనే ఒకడు భక్తుడనే పేరుకు పూర్ణమైన యోగ్యతను కలవాడు అవుతాడు— అని అర్థం కాదు. ఈ విధంగా ఉండే పెద్ద పెద్ద ధర్మకార్యాలను చేయడం అందరికీ వీలు కాదు. ఎవరో కొందరు మాత్రమే వీటిని చేయగలరు. ఆ విధంగా చేసేవారే విశేషధనికులు అని, విశాలమైన మనస్సు కలవారని చెప్పగలం తప్ప, భక్తులని చెప్పడానికి వీలు కాదు.

అయితే, మరి, నిజమైన భక్తుని గుర్తు ఏమి? అనే ప్రశ్న వస్తుంది. నిజమైన భక్తుని చూడడం అరుదే అయినప్పటికీ కష్టం ఏమీ కాదు. భగవంతుని విషయంలో స్వార్థాన్ని భావించని ప్రేమను కల భక్తుని విషయంలో ఏ సమయంలో అయినా మనం విశేషాన్ని గమనించవచ్చు. ఏ కాలంలో అయినా, ఏ దేశంలో అయినా, ఏ స్థితిలో అయినా భక్తులు భక్తులుగానే ఉంటారు. స్నానం చేయడం, భుజించడం మొదలైన కార్యాలను చేసేటప్పుడు, బంధుమిత్రాదులతో వ్యవహరించేటప్పుడు, వ్యాధులతో బాధపడేటప్పుడు, పలు విధాలయిన కష్టాలు ఏర్పడినప్పుడు, విశేషమైన లాభాలు

లభించినప్పుడు భక్తుడు భక్తుడు గానే ఉంటాడు. అన్ని సమయాలలోనూ, అన్ని దేశాలలోనూ, అన్ని స్థితులలోనూ అతని సాధారణమైన స్థితి మారకుండానే అతడు ఉంటాడు. ఏ విధమైన అతిశయం అతనిలో కనిపించదు. ఎల్లప్పుడూ సహజమైన సంతోషంతో శాంతమూర్తిగా ఉంటాడు. ఏ విధమైన మార్పు అతనిలో కనిపించదు. గొప్ప ఆపదలలోకూడా తన స్థితి నుండి మార్పును పొందడు. సహనం, దయ, శాంతి, పరిశుద్ధి, ఇంకా ఇటువంటి మంచి గుణాలు అతనిలో స్పష్టంగా కనిపిస్తాయి. భక్తియొక్క స్థితి ముదిరే కొద్దీ ఈ గుణాలు ఇంకా అభివృద్ధి చెందుతూ వస్తాయి.

ఎవడు తన కర్తవ్యాలను ఏ కొరత లేకుండా నిర్వహిస్తాడో, గొప్పదైన ఆపదలు ఎదురైనప్పుడు కూడా ఆ కర్తవ్యాలను చేయడంలో తల వెంట్రుక వాసి కూడా మీరకుండ ఉంటాడో, తాను, ఇతరులు, చుట్టాలు మిగిలినవారు, మిత్రులు, శత్రువులు– అనే భేదభావం లేకుండా అందరి విషయంలోనూ ఒకే విధంగా నడుచుకుంటాడో, లోపల, బయట ఒకే విధంగా ప్రవర్తిస్తూ ఋజువుగా వర్తిస్తాడో, భగవంతుని విషయంలో మనసు నిండిన ప్రేమను కలిగినవాడై ఉంటాడో, అతడే నిజమైన భక్తుడు. పాలను, నీటిని వేరు చేయగలిగిన హంసవలె, అటువంటి భక్తులను అనాయాసంగా పెద్దలు గుర్తిస్తారు.

శ్రీవిష్ణుపురాణంలో మూడవ అంశలో ఏడవ అధ్యాయంలో యమకింకర సంవాదంలో మహా భక్తుల లక్షణాన్ని యముడు తన కింకరులకు చాలా విశదంగా చెప్పడం మనకు గోచరిస్తుంది. అక్కడ ఉండే పలు శ్లోకాలలో, ఒక శ్లోకం మాత్రమే ఇక్కడ ప్రస్తావింపబడుతున్నది.

*న చలతి నిజవర్ణధర్మతో యః*

***సమమతి రాత్మ సుహృద్విపక్షపక్షే,***
***న హరతి న చ హంతి కించిదుచ్చైః***
***సితమనసం తమవేహి విష్ణుభక్తమ్.***

ఈ శ్లోకం తప్పక కంఠస్థం చేయవలసిన శ్లోకం.

# కూరేశుల తనియన్ శ్లోకంలోని గొప్పతనం

మన పూర్వాచార్యులు అందరికీ తనియన్ శ్లోకాలు ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అవతరించాయి. శ్రీకూరేశులకు తనియన్ అవతరించిన విధం నిజానికి చాలా విలక్షణమైనది. ఈ శ్లోకం వారి కుమారులైన పరాశర భట్టర్ అనుగ్రహించినందున, వారి విలక్షణమైన వాక్చాతుర్యం ఇందులో విజృంభించి వెలుగుతున్నది. " "యదుక్తయః త్రయీ కంఠే యాంతి మంగళసూత్రతామ్" అనేది కూరేశుల తనియన్ శ్లోకంలో రెండవ భాగం. కురేశుల శ్రీసూక్తులు వేదం అనే కాంత కంఠంలో మంగళసూత్రంగా వెలుగుతున్నాయి– అని చాలా చమత్కారంగా ఇందులో చెప్పబడింది. ఈ సూక్తిలోని సౌందర్యాన్ని కొంచెం అనుభవిద్దాం.

లోకంలో స్త్రీలకు కంఠంలో మంగళసూత్రం లేని దశలు రెండు. అందులో, కన్యకాదశ ఒకటి. భర్త గతించినప్పుడు విధవ అయిన దశ రెండవది. వీటిలో, కన్యకాదశలోని స్త్రీని పలువురు నాయకులు తమకు ఆమె పత్ని కావాలని కోరే దశ ఉండవచ్చు. ఎందుకంటే, స్త్రీకంఠంలో ఉండవలసిన మంగళసూత్రం ధరించే వరకు పలువురు బ్రహ్మచారులు, విధురులు ఆమెను తమకు భార్యగా భావించే అవకాశం ఉన్నది. "ఈ స్త్రీకి నేనే నాథుడను కావాలి" అని స్వరూపయోగ్యత కలిగినవారు అందరూ భావించే అవకాశం ఉన్నది కదా. అంతేకాక, విరక్తులు, గృహస్థులు కూడా "ఈ కన్యకకు ఇంకా భర్త నిశ్చయింపబడలేదు" అని సాధారణంగా భావిస్తారు. ఆ కన్యక కంఠంలో తాళి కట్టబడిన తరువాత, అంతవరకు ఈమె తమకు కావాలి అని అభిమానించిన బ్రహ్మచారులు, విధురులు కూడా "ఇక ఈమె అనన్యార్హ" అని

నిశ్చయించుకొని, ఆమెపై తాము ఆశపడడం మానివేస్తారు. ఆమె విషయంలో సాధారణంగా భావించిన మిగిలిన గృహస్థులు, విధురులు కూడా "ఈమెకు ఒక భర్త ఏర్పడ్డాడు" అని భావిస్తారు.

ఇక, రెండవది అయిన వైధవ్య దశలో, ఆ స్త్రీని చూసేవారు, " ఈమెకు ముందు ఏర్పడిన భర్త ఇప్పుడు లేకుండా పోయాడు. ఇక, ఈమెకు ఏనాడూ భర్త ఏర్పడే అవకాశం లేదు" అని తలుస్తారు. అందుచేత, స్త్రీలకు మంగళసూత్రం లేని స్థితులలో, పలువురు ఆమెకు భర్తగా భావించే స్థితి, ఏ భర్త లేని స్థితి– అని రెండు స్థితులు ఉంటాయి.

ఆ విధంగానే, కూరేశుల శ్రీసూక్తులు. అవతరించటానికి ముందు, వేదకాంత మంగళసూత్రం లేని స్త్రీలవలె, రెండు విధాలైన స్థితులను కలిగినది అయినది. వేదానికి రుద్రుని పతిగా కొందరు భ్రమించి అభిమానించారు. బ్రహ్మను పతిగా మరి కొందరు భావించారు. ఇంకా, పాశుపతులు మొదలైన మతాంతరులు పలు పలు దైవాలను పతిగా అభిమానించడం జరిగింది. ఆ విధంగానే, నిరీశ్వర మీమాంసకులు మొదలైనవారు వేదానికి నాయకుడే లేడని భావించడం జరిగింది. కూరేశుల పంచస్తవి మొదలైన దివ్యసూక్తులు అవతరించిన వెంటనే, శిరస్సును ఖండించినవాడు కాని(శివుడు), శిరస్సును ఖండింపబడినవాడు కాని (బ్రహ్మ), ఇంకా మరి ఏ దైవం కాని, వేదానికి నాయకుడు కాడు. పూర్తిగా నాయకుడే లేడని అనడం కూడా తగదు, నాయకుడు ఉన్నాడు, అతడు ఒక్కడే, అతడు శ్రీమన్నారాయణుడే –అని శిలాశాసనంగా నిర్ణయింపబడినందున, వీరి శ్రీసూక్తులు వేదకాంతకు మంగళసూత్రంవంటివి అయినవి.

ఇందువల్ల, సకలదుర్మతాలను నిరసించి, పరతత్వ నిర్ణయం చేయగలిగిన వాగ్వైభవాన్ని కలవారు, కురేశులు– అని చెప్పినట్లు అయినది. వస్తుస్థితిలో శ్రీభాష్యాదులు. అవతరించినప్పటికీకూడా, కూరేశుల పంచస్తవి అవతరించి ఉండకపోతే, మన భగవద్రామానుజదర్శనానికి అపరిహార్యమైన కొరత ఏర్పడి ఉండేది కదా.